శ్రీ అనంతలక్ష్మి ఆర్ట్ పిక్చర్స్

# ప్రేమలు పెళ్ళిళ్ళు

దర్శకత్వం: వి. మధుసూదనరావు

నిర్మాత: డి. భాస్కరరావు

అన్నపూర్ణా ఫిలిమ్స్ వారి






# కన్నెవారి కలలు

నిర్మాత-దర్శకుడు:

**యస్.యస్.బాలన్**

సంగీతం వి.కుమార్

పాటలు. రాజశ్రీ, డా॥ సి నారాయణరెడ్డి

మాటలు. రాజశ్రీ

కెమెరా కె.పొడియా

ఈస్ట్మన్ కలర్

# ఉత్తరాలు

## "తెలుగు గోడు"

28.12.73 సంచికలో పడిన శ్రీ వావిలాల గోపాలకృష్ణగారి ఉత్తరం చదివాను.

'ఆంధ్రప్రదేశ్' భారతదేశంలో ఒక భాగం అని అందరికీ తెలుసు. 'తెలంగాణా' ఆంధ్రప్రదేశ్‌లో ఒక భాగం అని ఎందరికి తెలుసు?

'హిందీ' భారతదేశానికి 'జాతీయ భాష' అని ఎందరికో (!) తె . . తెలుగు 'ఆంధ్రుల' భాష మాత్రమే కాదని ఎందరికి తెలుసు ?

'తిరుపతి దేవుడు' ఆంధ్రుల దేవుడు అని వివరా అనుకోవటం లేదు ! అక్కడి పూజారులూ, జియ్యరూ తమిళులని విన్నాను !

'మీ తెలుగు బాగాలేదు' అని ఎవరయినా అంటే ఎందుకు 'అంటే' బాధ ? (గుమ్మడికాయా— భుజాలూ గుర్తుకి వస్తున్నాయి నాకు..) ఇప్పుడు తెలుగు సినిమా తెరమీదనుంచి వినబడే 'యాస' ఒక ప్రాంతంలో, ఒక కులం వారిది. అదే ఇప్పుడు రాతలలో కూడా కనిపిస్తోంది. దీనిని తలుచుకొని కన్నీరు పెట్టే వారు ఎందరో కనిపించరు . . . .

ఆంధ్ర, తెలంగాణాలు విడిపోయిన అనంతరం ఈ ఆక్రందనలన్నీ ఆగిపోతాయి.

ఆర్. గంటి (మదరాసు).

## నడుస్తున్న చరిత్ర

జై ఆంధ్ర అన్నారు. జై జై ఆంధ్రా అన్నారు. అరిచారు. అరిపించారు. ఎవరు ? మహా నాయకులు. ప్రజా నాయకులు. నేడు ? తిరిగి వారి వారి పదవులను అలంకరించారు. విద్యార్థి నాయకులమని చెప్పుకున్న మహానుభావులు, రక్తం చిందిస్తామని పలికిన మహామహులు ఏరి ? ఎక్కడున్నారు? ఉన్నారు. లేకేమి ? పసుపు కుంకుమలు కోల్పోయిన ఇల్లాళ్ల రాలిన బొట్టులో, తలిదండ్రులను పోగొట్టుకున్న బిడ్డల ఆర్తనాదాలలో కన్నబిడ్డలను కోల్పోయి, గర్భశోకం అనుభవిస్తున్న తల్లుల కన్నీళ్లలో దాగున్నారు ! ఆనాడు అన్ని కబుర్లు చెప్పి, అమాయకులను రెచ్చగొట్టిన వారు నేడు వారికి తిరిగి జీవం పొయ్యగలరా ? లేరు. కాని వారికి ఒక వేడుకోలు. ఆరంభశూరత్వం మాత్రమే కల్గిన మనం ఏ పనీ సాధించలేమని తెలుసుకుని, మరెన్నడూ స్మశానాలలో ఆటలు ఆడవద్దు. ఇదే నా కన్నీటి విన్నపం.

— వి. భాస్కర్‌ప్రసాద్‌శర్మ, (విశాఖపట్నం)

## సినిమా

21.12.73 పత్రికలో శ్రీనివాస్‌గారు ఇలా వ్రాశారు. "రోజు రోజుకీ కృష్ణ ప్రజలకు దగ్గరవాడవుతున్నాడు. మంచి విశ్వాసగా నేగాక నటుడిగాకూడా గుర్తింపబడుతున్నారు" ఇది అన్నది నాగేశ్వరరావుగారు. నాగేశ్వరరావుపై నాకు నటుడిగా గౌరవమేగాని నాగేశ్వరరావు సమావేశాలలో మాట్లాడడం నేర్చుకోవాలని నా మనవి. "నటుడిగాకూడా"— అంటే అర్థం ఏమిటి ? కృష్ణ నటుడు కాకపోవచ్చు. కానీ అలా అందరి ఎదుట అలా అనడం అనుచితం.

— ఎల్. చంద్రశేఖర్ (ఒంగోలు)

• • •

14.12.73 తారీఖు "ఆంధ్ర సచిత్ర వార పత్రిక" ముఖ చిత్రం హిందీ నటి జయభాదురి ఎంతో అందముగా ఉన్నది.

— అనుమోలు అచ్యుతరావు (విజయవాడ)

## కథలు

67వ సంపుటము, 17వ సంచికలో 'తెలుగోడి గోడు' అనే వ్యాసం గురించి నా తెలుగు భాష పూర్తిగా వ్యర్థమని వ్రాసినందుకు రవ్వంత బాధ కలిగి ఇలా వ్రాస్తున్నాను. రాజ్ భాయ్ ! ఈ వ్యాసం పాతదే కావచ్చు. మరోసారి చదవండి. క్రొత్తదనం కనిపిస్తుంది. 'హైదరాబాద్ హాట్ బుక్' ఇంగ్లీష్ శీర్షిక తెలుగు పత్రికలో ప్రచురించటము, మీరు 'నవంబరు, అని వ్రాయటంలో తేడా ఏముంది ? మీరు వ్రాసినట్లు చారిత్రక కారణాలు ఉండవచ్చు (?) అయినప్పటికీ ఒకరినొకరు గేలి చేసుకొనడం కంటె పర భాషని ప్రేమిస్తూ, మన భాషని మనం గౌరవించడం నేర్చుకోవాలి. అదీ తెలియకపోతే మలయాళీలను చూసైనా నేర్చుకోవాలి. ఏమంటారు ?

— శ్రీ హనీఫ్, (మద్రాసు)

# పాఠకులకు మనవి

అనివార్య కారణాలవలన తేది 1–1–1974 నుంచి ఆంధ్రపత్రిక దినపత్రిక, 11–1–1974 నుంచి ఆంధ్ర సచిత్ర వారపత్రిక విక్రయింపబడే వెలలు ఈ క్రిందివిధంగా వుంటాయని పాఠకులకు మనవి చేస్తున్నాము.

## ఆంధ్రపత్రిక దినపత్రిక చందా రేట్లు

### తేదీ 1-1-1974 నుండి

విడి పత్రిక — 0–18 పైసలు
(ఆదివారంనాడు వెలువడు పత్రికకూడా 18 పైసలే)

| | | ఏజంటుద్వారా | పోస్టుద్వారా |
|---|---|---|---|
| సంవత్సరమునకు | — | రు. 62–80 | 70–00 |
| ఆరు మాసములకు | — | రు. 31–40 | 35–00 |
| మూడుమాసములకు | — | రు. 16–20 | 18–00 |
| 1 నెలకు | — | రు. 5–40 | — |

## ఆంధ్ర సచిత్ర వారపత్రిక చందా రేట్లు

### తేదీ 11 - 1 - 1974 నుండి

| | | | |
|---|---|---|---|
| విడి పత్రిక | — | రు. 0–55 పైసలు | |
| సంవత్సరమునకు | — | రు. 28–60 | 31–20 |
| ఆరు మాసములకు | — | రు. 14–30 | 15–60 |
| మూడుమాసములకు | — | రు. 7–15 | 7–80 |

దిన, వార పత్రికలకు పై తెలిపిన తేదీలకు తర్వాతి కాలమునకు ఇదివరకే చందాలు చెల్లించినవారి చందా మొత్తములు క్రొత్త రేట్లకు అనుగుణంగా సవరించబడును.

మేనేజరు,

ఆంధ్రపత్రిక



త్వరలో బంధవిముక్తి
మండలాల పద్ధతి
ఢిల్లీ నుంచి నాకేదైనా ఉత్తరం వుందా?
పతనం దగ్గరలోనే వుంది!
చౌకదుకాణం
సారీ! స్టాకు లేదు.

# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(1938 - 1972)

శుక్రవారం : 11-1-1974
శ్రీప్రమాదినామ సం. పుష్యమాస ఐ. తదియ
సంపుటము : 67 సంచిక : 20

స్థాపితం 1908
సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ
ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ-3
విడి ప్రతి వెల 55 పైసలు


## విషయానుక్రమణిక


ముఖచిత్రం :
'కన్నవారి కలలు' లో శోభన్‌బాబు, వాణిశ్రీ.

**కథలు :**

దోసెడు మల్లెలు ... 12
పరాజితులు ... 18

**సీరియల్ కథలు :**

స్వయంకృతం ... 6
ఆశకు సంకెళ్లు ... 36

**వ్యాసాలు, శీర్షికలు :**

ఉత్తరాలు — 2, ఉమెన్ కార్నర్ — 4, సినిమా బ్యూటీ బులెటిన్— 18, యువతరం— 22, సినిమా — 24, అవీ — ఇవీ — అన్నీ — 32, ధర్మపథం, వారఫలం — 42, ఒకవారం విప రీతం— 44, డాక్టర్ సలహాలు— 45, హైదరాబాద్ నోట్‌బుక్-46, ప్రశ్నావళి-47, పుస్తకసమీక్ష-48.


## మనలో మాట

ఈ వారంతో 'ఆశకు సంకెళ్లు' సీరియల్ పూర్తి అయింది...పై వారంనుంచి కొత్త సీరియల్‌తోపాటు 'ప్రతిబింబాలు' అనే పెద్దకథ ఒకటి ప్రారంభిస్తున్నాము. కాగితం కొరత ఎంత భయంకరంగా వున్నా, మా పాఠకుల అభిరుచిలోని వైవిధ్యాన్ని దృష్టిలో వుంచుకొని వివిధ శీర్షికలను నిర్వహిస్తూనే కొత్తవాటిని ప్రవేశ పెట్టడానికి ప్రయత్నం చేస్తున్నాము.

25-1-'74 సంచిక నుంచి 'గాలిపటాలు' నాటకాన్ని సీరియల్‌గా వేస్తున్నాము. 'పెద్దకథ'ల పట్ల చాలామంది పాఠకులు చూపుతున్న ఆసక్తి నిబట్టి వాటిని వరుస తప్పకుండా అందించే ప్రయత్నంలో వున్నాము.

పోతే రచయితలకు అయిష్టంగానైనా చిన్నమాట చెప్పవలసి వున్నది. దీపావళి కథల పోటీకి వచ్చిన కథలు—అవి గడువు తీరిన తరువాత వచ్చినవైనా సరే—మామూలు ప్రచురణకు పరిశీలించి, ప్రచురణకు తీసుకున్న వాటి గురించి ఆయా రచయితలకు తెలియబరిచాము. ప్రచురణామోదం పొందని కథలను త్రిప్పిపంపే ప్రసక్తిగాని, ఉత్తరప్రత్యుత్తరాలకు తావు గాని లేదని నిబంధనలు చదివిన వారికి వేరే మనవి చేయ నక్కర లేదనుకుంటున్నాము.

వ్యాసరచన పోటీ విజేతలలో యిద్దరు మాత్రం మాకు ఫోటోలతో వారి వివరాలు వెంటనే అందజేశారు...వాటిని యిక్కడ వేస్తున్నాము.



శ్రీ అంబటి సత్యనారాయణరావు

'తూర్పు గోదావరిజిల్లా, అమలాపురం తాలూకాలోని గొల్లవిల్లి గ్రామంలో ఒక సాధారణ రైతుకుటుంబంలో జన్మించాను. స్వగ్రామంలోనే ఉన్నత పాఠశాలలో ఉపాధ్యాయుడిగా పనిచేస్తున్నాను. ఏ విధమైన రచనానుభవం లేదు. అభిమాన రచయితలు శ్రీ కొండవగంటి కుటుంబరావు, శ్రీ మధురాంతకం రాజారాం.'



శ్రీమతి ఇంద్రగంటి జానకీబాల

'నేను 4-12-'45 తేదీన పుట్టానని అంటారు. నాకు చిన్నప్పటినుండి పాటలు పాడటమన్నా, కథలు వ్రాయడమన్నా చాలా యిష్టం. ప్రస్తుతం నేను ఆకాశవాణి లలిత సంగీతం ఆర్టిస్టుని. నా కథలుకొన్ని ఆంధ్రపత్రిక, స్వాతి, ఆంధ్రజ్యోతి పత్రికలలో ప్రచురించబడ్డాయి. నా రచనా వ్యాసంగానికి మావారు శ్రీకాంతశర్మ ఎప్పుడూ ప్రోత్సాహం యిస్తూ వుంటారు.'

## పై వారమే!

# సంక్రాంతి సంచిక

[కొత్త ఆకర్షణలతో]

### "ఏటిలోని కెరటాలు" కొత్త సీరియల్

సంసారంలో వచ్చే కొన్ని కలతలు ఆధునికయువతి అభిమానంమీద దెబ్బ తీసినప్పుడు ఆమె సొంతకాళ్ళమీద నిలబడాలని ప్రయత్నం చేయటంలో తప్పు లేదుకానీ, అపార్థాలు అనర్థాలకు దారితీయకముందే, ప్రేమ వసివాడిపోకమునుపే తేరుకొని నిలకడమీదనైనా నిజం తెలుసుకోటం వివేకమని చెప్పేకథ...తెనుగు జీవితానికి తేట తెనుగు ప్రతిబింబాలు పట్టిన కథనం.




(గత సంచిక తరువాయి)

ఎవరైనా సుందరిని పెళ్ళాడిందికి అంగీకరించినా...సుందరి ఏమంటుందో? ఆమెను బలవంతంగా వొప్పించినా...ఆమె తల్లిదండ్రులు ఒప్పుకోవాలి కదా ? ఇలాంటి సమస్యలు చక్రపాణికిలేవా ? ఉన్నా అతడు... లక్ష్యపెట్టడు...భయపడ్తేనే మరింత భయం. కప్పుకుంటేనే చలి పెరుగుతుంది...నిజమే ఎవరినో తగిన వ్యక్తిని చూసి వొప్పించి, సుందరికి బలవంతంగానైనా ముడివెయ్యాలి. పెళ్ళంటూ జరిగాక ఎవరెన్ని అన్నా సుందరి సుఖంగానే ఉంటుంది.

అప్పట్నుంచి సుందరిమీది దృష్టి... సుందరికి కాబోయే భర్త మీదకు మళ్లింది.

డబ్బు బాగా ఉండాలని కాదు...పెద్ద చదువు అవసరంలేదు రూపంతో పనిలేదు—అన్నింటినీ మించిన మనసు కావాలి. ఈనాడు జాలితో చేసుకుని—రేపు 'నిన్ను ఉద్ధరించాను' అంటూ నరకం సృష్టించే వ్యక్తికన్నా ఇప్పటి నరకమే నయం!

నాకు స్వంత అన్నదమ్ములు లేరు. లేని వాళ్ళ గురించి బాధ పడటంకన్నా ఉన్న వాళ్ళల్లో ప్రయోజకు లెవరు? అని ఆలోచిస్తే నయమన్పించింది. మా వార్ని అడిగితే ఎవరైనా చేసుకుంటే అంతకంటే మంచి మరొకటి లేదు. కానీ...మన వాళ్ళల్లో...అంత సంస్కారవంతు లెవరు? అంటూ పెదవి విరిచేసారు—మనవాళ్ళే కావాలా? అని అడిగాను.

పూర్వపు సమస్యల లాగా ఇది కాలం అడుగున కూరుకుపోలేదు...ఎక్కడికి వెళ్ళినా ఎవరితో మాట్లాడినా ఈ కోణం నుండే నా ఆలోచనలు సాగేవి. ఒకళ్ళిద్దరు ద్వితీయ కళత్రాన్కి సిద్ధంగా ఉన్నవారైనా...చక్కని కన్యలను కోరుకున్నారే కానీ...బాల వింతతువు వాసన పడనివారే—ఇలా ఆలోచనా తరంగాల్లో కొట్టుకుంటున్న రోజుల్లో...హఠాత్తుగా దిగాడు మా వాసు. ఎక్కడో విదేశాల్లో పెద్ద హోదాలో పాతుకుపోయిన వాడు...వచ్చి... ఒక్కసారిగా "అక్కా!" అంటూ గుమ్మంలో నిలబడ్తాడని కల్లోకూడా ఊహించలేదు నేను.

"రెండు నెలలే శలవు. అందర్నీ చూసి పోదామని వచ్చాను. అమ్మా నాన్నా నెక్స్ట్ ఇయర్ వస్తారు ఇండియాకు" నాలుగేళ్ల కబుర్లూ రెండ్రోజుల్లో చెప్పడాన్కి వొట్టు పెట్టుకున్నట్లు గడగడా చెప్పేస్తున్నాడు.

"నువ్వు వస్తున్నట్టు కనీసం ఉత్తరమైనా లేదు. పోనీ కెనడానుండి అక్కర్లేదు. ఇండియా కొచ్చాకైనా రాయలేకపోయావా?" వాడి ప్రక్కన కూర్చొంటూ అడిగాను.

"ఉత్తరం అందలేదూ ...? పదిరోజులైందే ... సర్లే...నేవెళ్ళిపోయాక వస్తుంది కానీ ... ఏమిటి సంగతులు ?" బూట్లు విప్పుకుని స్లిప్పర్లు వేసుకుంటున్న వాడి పాదాలవంక చూసాను. తెల్లగా...నున్నితంగా అతి శుభ్రంగా మెరుస్తూ ఉన్నాయి. మట్టిలో కాలుపెట్టని మహారాజు! పాదాల నుండి నాదృష్టి ముఖంవైపు మర్లింది. ఆవేమీ పట్టించుకోనట్లు టవల్, సోప్ తీసుకుంటున్నాడు తన సామానులోంచి ... ఇతడు ... ఇంత అందగాడు—హోదాకు హోదా ఉన్నవాడు ...సుందరిని వివాహం చేసుకుంటాడా ?

"ఏమిటి ... నేంలేచినా నువ్వులేవవా?" లోపలికి నడిచాడు.

రెండోరోజు రాత్రి పిల్లలు నిద్రలు పోయాక ముగ్గురం పేక కలిపాం.

"ఆఁ ... ఏమిటోయ్ ... అక్కడెవరైనా పిల్లని చూసుకున్నావా...?" ఈయన హాస్యం చేసారు.

కబుర్లు మెల్లిగా పెళ్లివైపు మర్లాయి. నేను వాడి సమాధానం కోసం పేకముక్క వెయ్యడం మానేసి చూస్తూ ఉండిపోయాను.

"నువ్వేమిటి ... అలా బిగపట్టేసుక్కూర్చొన్నావ్...కార్డ్ వెయ్యి" నన్ను తట్టి లేపారు.

"ఏం బావగారూ... మీ దృష్టిలో ఎవరైనా ఉన్నారేమిటి చెప్పండి...మనలో మన మాట" కన్నుగీటి నవ్వుతూ అడిగాడు వాడు.

"నా దృష్టి ఉంటే నీ కెందుకిస్తాను—నే కట్టేసుకుంటా గానీ!"

ఇద్దరి సంభాషణా వింటూ కూర్చున్నాను మౌనంగా.

"అలా పనికిరానివంటి బాబూ...ఉంటే చెప్పండి లేవదీసుకు పోతాను..."

చూనావా ... మి తమ్ముడు ఎంత ప్రయోజకుడయ్యేడో ... వ్యవహారం చాలా దూరం వచ్చేసింది'' నాతో అన్నారు.

''పెళ్ళిఅయిన మీకు మళ్ళీ కట్టుకోవాలని ఉంటే ... బ్రహ్మచారిని ... నాకు ఉండ దంటారా ?'' నవ్వాను.

''అయితే...పెళ్ళికాని వాళ్ళందరూ బ్రహ్మ చారులేనన్న మాట !''

ధోరణి మారింది!...''ఆటవెయ్యండి...'' అని ''సరేలే కానీ...సీరియస్‌గా చెప్పు...పెళ్ళి చేసుకోవా ?'' అన్నాను.

''పిల్లను చూపించు !'' ఒక్కొక్క ముక్క ఎత్తుతూ అన్నాడు.

''చూపిస్తే తాళి కట్టేటట్లు మాట్లా డుతున్నావ్‌లే కానీ...పిన్ని బాబాయ్ ఏమంటు న్నారు నీ పెళ్ళి విషయంలో ?''

''ఏమిటి వాళ్ళనేది ? నేయిష్టపడ్తే చాలంటారు !''

''పోనీ ఒక మాట చెప్పు...దాచకుండా... మనదేశం పిల్లని చేసుకుంటావా... అక్కడే ఎవర్నైనా?''

''అబ్బే... లేదే...ఎప్పటికైనా మనదేశం, మన ప్రాంతాల పిల్లనే చేసుకుంటాను...''

దేశాలు తిరిగి, నాలుగు రకాల మనుష్యు లనూ చూసిన మనిషికి నా మనసులో ఉన్న మాట చెప్పడంలో తప్పులేదనిపించింది.

''అయితే నేను ఎవరినైనా చెప్తే... బల వంతం ఏమీ లేదు...ఆలోచిస్తావా ?''

''ఆహాఁ...''

మూడో నాడు తీరికగా కూర్చొన్నప్పుడు అన్నీ వివరించి చెప్పాను. వెంటనే ఏమీ సమా ధానం చెప్పకుండా ఆలోచిస్తూ కూర్చొండి పోయాడు వాసు.

''బలవంతం ఏమీలేదు—ఆ పిల్లనుచూస్తే నా స్వంత మనిషి అన్పించబట్టి అలా చెప్పానే కానీ...చెప్పాక చేసుకోకపోతే కోపం వస్తుం దనుకోకు !'' అన్నాను.

''అబ్బే... చేసుకోడానిక్కి పెద్ద అభ్యంత రాలేం ఉంటాయికానీ... మరి ఏమీ చదువుకో లేదంటున్నావ్ ?''

పెద్ద బరువు దించినట్లు ఫీలయ్యాను. అతను అనేది ఒక సమస్యకాదు. చదువుకన్నా నల్గురిలో మాట్లాడగలిగే పరిజ్ఞానమే అతనికి ముఖ్యం. ఆ సుందరిలాంటి తెలివైన పిల్లకు అది నల్లేరు మీది బండినడకే! ఆ విషయమే చెప్పాను.

''అలా అయితే నాకు పెద్ద అభ్యంతరం లేదు కానీ నీవు ఎంత అందగత్తె అని చెప్పినా ...మరి ఒకసారి నేనూ చూడటం న్యాయం కదా... వాళ్ళ ఊరు వెళ్ళి చూసిరానా ?''

''అమ్మో ! నువ్వువెళ్తే... ఆ అమ్మాయి కన్పిస్తుందేమిటి — నేను రప్పిస్తాను ... ఈలోగా నీవు కాసిన్ని ఊళ్ళు తిరిగిరా. పదిహేను రోజులు పడ్తుంది ... '' అంటూ వాసును చాలా సంతోషంగా మిగిలినఊళ్లకు తరిమేసాను.

అతను వెళ్లిన మర్నాడే సుందరి పేరున ఒకటీ, పెద్ద అత్తగారి పేరున ఒకటీ నాకు అనారోగ్యంగా ఉంటోందనీ, సుందరిని అన్యథా భావించక పంపితే ఒకనెల అట్టే పెట్టుకుని పంపుతాననీ, స్వంతచెల్లెలు లాంటిదని తోచి ఆ విధంగా రాస్తున్నాననీ, లేని మన్ననా, రాని జబ్బూ కుప్పిస్తూ చదివే వాళ్లకు సీర్సం వచ్చేలాగా ఉత్తరాలు రాసి పోస్ట్ చేసాను.

''నువ్వు చేసే పని ఎన్ని గొడవలను రేపు తుందో ఆలోచించుకు మరీచేయి! '' శ్రీవారు బెదిరించారు. అంతకంటే గట్టిగా అరిచినా వినేపరిస్థితుల్లో లేనని ఆయనకూ తెల్సు !.

''వచ్చినప్పట్నుంచీ చూస్తున్నాను నీవు మా వదినవేకాదు ... ఏమిటో తెగ హడావుడి పడిపోతున్నావ్ పెళ్లివారిలాగా !'' నవ్వుతూ అంది సుందరి.

'ఒక్క పెళ్లిలోనే నేమిటి హడావుడి ... కుదిరేముందు ఎంతపని ... ? కుదిరేక ఎంతపని ... ? పెళ్లివారమే అనుకో ! ' అన్నాను.

''ఏం మీ చెల్లెలి పెళ్లి కుదిరిందా ? ''

అంతకంటే సుందరికి తద్దుదనుకుంటే నాదే పొరబాటు.

''అబ్బే...'' అనేసి ఊరుకున్నాను.

సుందరి వచ్చి రెండు రోజులు పూర్తయినా అసలు విషయం ఎలా ఎత్తాలో తెలియడం లేదు—

''అనారోగ్యం అని రాసావు...మునపటి కంటే ఆరోగ్యంగా ఉన్నావ్ ?'' హాస్యం చేసింది సుందరి.

''పోనీ ... నిన్ను చూడాలన్పించిందనుకో కూడదూ ?''

''అదే అనుకున్నానులే !''

''సుందరీ మా తమ్ముడొకడు కెనడానుండి వచ్చాడు. మా వాడిని నేను పొగడకూడదు కానీ...చాలా బావుంటాడు, పెద్ద చదువు— పెద్ద ఉద్యోగం...''

''అయితే ఏమిటి...?'' జడ చివర్న తన ఆలోచనలకు వేసినట్లే బిగించి ఊలుముక్క పెట్టేసింది.

''అబ్బే...సంబంధం ఏదయినా ఉంటే చెప్తావని !'' ఇంకేమనాలో తెలియదు. సుందరి ఎదురుగా ఎప్పుడూలేని జంకు. ఎన్నోసార్లు చెప్పాలని ప్రయత్నించినా, చెప్ప లేక, వాసు వచ్చాక పరిస్థితి అదే చక్కబడ గలదని వాయిదా వేసేసాను. మనసులో సుందరి పరిస్థితిని అర్థం చేసుకుని సుఖపడ్తుందా అనే సందేహం...సుఖపడాలని ఆశ !

వస్తానన్న దానికన్నా నాల్గురోజులుముందే వచ్చేసాడు వాసు. ముందు సుందరే గుమ్మం దగ్గర కనబడింది. ఎవరైనా వచ్చినా గబ గబా లోపలికి పరుగెడ్తున్నట్లు లోపలికి వచ్చేసి, ''ఎవరో వచ్చారు !'' అంటుందే కానీ ఎవరో...ఎందుకో—ఇవేమీ అడగదు.

అదేవిధంగా వాసును చూసి ''వదినా... ఎవరో వచ్చారు !'' అంది. చేస్తున్నపనిని ఆపి వెళ్ళే వీలులేక''కాస్త ఊరూపేరూ కనుక్కో

ఈ మాసం పెంచాకే స్టూడెంట్సుకు నామీద భయం పుట్టుకొచ్చింది !!!



# స్వయంకృతం

కూడదు...పరుగెత్తుకుంటూ రాకపోతే!''అని విసుక్కుంటున్నాను. ఈ లోగా "అక్కా... చిల్లర కావాలి''అంటూ కేకపెట్టాడు వాసు. వాడి పిలుపు విన్పించగానే ఒక్కసారి సుందరిని పరీక్షించాను — తెల్లముతక చీరలో తెల్లని జాకెట్టుతో బిగించి వేసుకున్న జడ తలమీద జుట్టును ఎవరో వెనక గుంజుతున్నట్లు నొక్కుకుపోగా ఏమిటన్నట్లు ప్రశ్నార్థకంగా నా వైపు చూసింది. వేషం ఎంత వెల వెల బోతోందో...ముఖం అంతకళగాఉంది. పెద్ద పెద్ద కళ్ళూ, వయసులో ఉండి, ఆరోగ్యంగా మెరుస్తున్న చెంపల నిగనిగలూ...ఆ ముఖాన అందమైన ఆ నుదుటిపైన కుంకుమే ఉంటే...

"వదినా...'' లోపలికి వస్తున్నవాసు వంక చూస్తూ అంది సుందరి.

"అక్కా...చేంజ్ కావాలి పదిరూపాయలకు'' పర్సులో వెతుక్కుంటూ గుమ్మంలో నిలబడిఉన్నాడు వాసు. టాక్సీ ఫేర్ చెల్లించి "ఎక్కడెక్కడ తిరిగారు...? ఏమిటి...'' అని "ఉండు కాస్త మంచినీళ్లు ముందు తాగు !" అంటూ వంటింటివైపు నడిచాను.

వంట యింట్లో సుందరిలేదు. బహుశ ఏ పడకగదిలోనో కూర్చొని ఉంటుంది. కాస్త బడలికలేని మనసు కుదుట పడేదాకా సుందరి కన్పించక పోవడమే మంచిదన్పించి ఊరుకున్నాను. నిజానికి వాసు సుందరి ముఖం చూచాడో లేదో తెలియదు.

మూడుగదుల ఆ యింట్లో సుందరిని ఎంతవరకూ దాచగలనో నాకే తెలియలేదు - అందుకే పడకగదిలో మంచం మీద కూర్చొని అంచుల కొసలు లాగుతూ కిటికీలోంచి శూన్యంగా చూస్తున్న సుందరిని పిలిచి పైకి లేపాను.

"సుందరీ ... నేనంటే నీకు గౌరవం ఉందా'' సూటిగా అడిగాను.

"అదేమిటి వదినా ...?'' అమాయకంగా భయంగా ప్రశ్నించింది.

"ఏమీలేదు ... ఆ జడ వేసుకోవడం మార్చుకోమని ఎన్నాళ్లనుంచి చెప్తున్నాను ? ఏమిటలా రెండు గుర్రాలని రెండు కొసలకీ కట్టి మరీ బిగించినంతలా బిగిస్తావు...కాస్త ఈ రోజయినా విప్పి వదులుగా వేసుకో. రంగు చీర కట్టుకపోతే అదే పోయింది. ఇస్త్రీ చీరయినా కట్టు ... ''

నా ధోరణి అర్థం అయినా అవనట్లు ముఖం పెట్టింది సుందరి. కొనదాకా వచ్చిన ఈ వ్యవహారాన్ని ఇంకా దాచి ప్రయోజనం లేదన్పించిందినాకు — "ముఖంలో ఎంత అందముంటే ఏంలాభం ... మామ్మలా తయారవుతావు !''

"మామ్మలకీ నాకూ తేడా ఏముంది వదినా ? '' నా మాటలు ఆమెను బాధిస్తున్నాయి.

"ఆ తేడా ముందు ముందు మాద్దాం కానీ గబగబా కానిచ్చి నాకు సాయానికి రా... వంట అవలేదు ... వాడు ఆకలి ఆకలి అంటున్నాడు ... '' లేనిపని కల్పించుకుని ఇవతలికి వచ్చేసాను.

అరగంట అయినా ఎక్కడా అలికిడి విన్పించలేదు. బాత్‌రూమ్‌లో వాసు చేస్తున్న నీళ్ల చప్పుడు తప్ప !

"సుందరీ......''

"వస్తున్నా...'' పిల్లిలాగా వచ్చింది. రూపంలో ఇసుమంతయినా మార్పులేదు.

"ఏమీలేదు...'' కోపంగా ముఖం తిప్పేసుకున్నాను.

"అదికాదు వదినా...'' ఏదో చెప్పబోయింది.

"నాకు పనుంది...'' వెళ్లి పొమ్మన్నట్లు ముఖం మాడ్చుకున్నాను.

ఏం మాట్లాడాలో తన మనసులో భావన నాకు ఎలా చెప్పాలో తెలీక కాబోలు...సన్నగా గొణుక్కుంటూ క్షణం నిలబడి మెల్లిగా లోపలికి వెళ్లిపోయింది.

పిల్లలకు క్యారియర్లు సర్ది ఇచ్చేసి ముగ్గురికీ వడ్డించి, సుందరీ ... వాసూ ... అంటూ పిలిచాను. వాసూ నేను ఏవో కబుర్లు చెప్పుకుంటూ ఎంతసేపు కూర్చున్నా సుందరి రాలేదు. మాట్లాడుతూనే ఇప్పుడే వస్తానంటూ లోపలికి నడిచాను.

కిటికీ ఊచలు పట్టుకుని వెనక్కి తిరిగి ఉంది సుందరి. సుందరి తప్ప మరెవరూ ఇంట్లోలేరు కాబట్టి...నిలబడి ఉన్న మనిషి సుందరే అని నిర్ణయించుకోవల్సి వచ్చింది. లేకపోతే ఆనుమాలు పట్టలేమేమో. వదులుగా జడవేసుకుని కింద ఏమీ పెట్టుకోలేదు. కుచ్చులాగా కొసలు విచ్చుకున్నాయి. పెద్దగా తైల సంస్కారం ఏనాడూ చేసుకోపోడం ఈ నాడు లాభించింది. సన్నంగా తగిన పొడవుతో...శుభ్రమైన చీరలో సుందరి పేరుకు తగినట్లు ఉంది.

"సుందరీ ... " భుజంమీద చేయివేసి పిలిచాను.

"వదినా..." ఉలిక్కిపడింది. కళ్ళల్లో ముత్యాల్లా నీరు.

"ఏడుస్తున్నావా...పనిలో ఏదో విసుక్కున్నాను" సుందరిలో నా మనసులోని భావం చూచాయగా అర్థం అవుతున్న సూచనలు...

"అదికాదు..." ఏదో అనబోయింది.

"ఏదీ చెప్పకు...రా...వాసు పరాయివాడు కాడు..." అంటూ చేయి పట్టుకుని తీసి కెళ్ళాను.

గబగబా అన్నం అటూ ఇటూ కెలికేసి అందరికన్నా ముందులేచి వెళ్ళిపోయింది.

"పాపం...ఆవిడను అనవసరంగా ఇబ్బంది పెడుతున్నావు..." విసుక్కున్నాడు వాసు.

"ఇబ్బందులో...కష్టాలో...మెల్లిగా అల వాటయితే ఏ బాధా అన్పించదు...వాసూ...ఆ అమ్మాయి పుట్టి పెరిగిన వాతావరణం అలాంటిది. మార్చుకోవల్సిన బాధ్యత మనది! "మనం" అన్న పదాన్ని నొక్కిపలికాను.

"అన్నట్టు...సుందరి ముఖం చూసావా?" ఆశగా అడిగాను.

ఆమె ముఖం చూచిన మనిషి ఎవరైనా ఆమెపట్ల ఆసక్తిని పెంచుకుంటారని నా నమ్మకం.

జవాబుగా చూసానన్నట్లు నవ్వాడు వాసు.

నా గుండెల మీద నుంచి బరువు దింపి నట్లు ఫీలయ్యాను. ఆమె ప్రవర్తనలో మార్పువస్తే చాలు ... వాసుకు అన్యాయం జరుగుతోందేమో...నన్నశంక అవసరంలేదు.

రాత్రి భోజనాలనంతరం బావా, మరదు లిద్దరూ కబుర్లలోకి దిగారు ... వాళ్లిద్దరకూ ముందు గదిలోనే పక్కలేర్పాటుచేసి నేను సుందరితో పడక గదిలో నడుం వాల్చాను.

నాపక్కన పడుకోవడం అలవాటులేక మంచం కొసన ఒత్తిగిల్లి పడుకుంది సుందరి.

"సుందరీ ... " నడుంమీద చేయివేసి లాగాను. ఏమిటన్నట్లు తిరిగింది.

"నిద్రవస్తోందా ?"

"లేదు ... "

"మరలా నిశ్శబ్దంగా ఉండిపోయావేం?"

" ... ... "

"కోపం వచ్చిందా ?"

"మీ తమ్ముడు ఇప్పుడెందు కొచ్చారు?" సూటిగా అడిగింది సుందరి.

"తను వేరే దేశాల్లో ఉంటున్నాడు ... నన్ను చూసిపోదామని ... వచ్చాడు ! "

"అతను వస్తారని తెలిసి ... నన్ను ఎందుకు పిలిపించావు ?"

పిపిపిల్లలాగా ముఖంమీద ఏ భావాన్ని ధావకుండా మాట్లాడుతోందామె.

"వస్తాడని నాకు ఎలా తెలుస్తుందను కుంటున్నావ్?" అబద్ధం ఆడబోయాను.

"ఇందాకమీరు మాట్లాడుకోలేదూ...?"

మేం ఏదో ధోరణిలో అనుకుని ఉండ వచ్చు...దానిని సుందరి ఇంతసులువుగా పట్టేసుకుంటుందని అనుకోలేదు. ఇంక ఏమేంవిందో తెలియదు. ఆమెకు సంబంధించిన విషయాలు ఎన్నో వాసుతో చెప్పాను! ఇంక దాచి ప్రయోజనం తోచక—

> ఒక 'ఎక్స్పర్ట్' జాక్‌పాట్ కొడ్తానని పందెం కాసి గెలిచాడు.
>
> "ఏమిటి దీని కిటుకు ?" అని అడిగాడు ఆతని స్నేహితుడు.
>
> "ఏముందీ ఇవాళ అయిదోతారీకు, నా కిద్దరు పిల్లలు. రెండంకెలనీకూడి ఎనిమిదో నంబరు గుర్రం మీద కట్టాను"అన్నాడు ఎక్స్పర్ట్‌జా.
>
> "అయిదూ, రెండూ కూడిక ఏడు కదా వస్తుంది ?" అని తెల్లపోయాడు స్నేహితుడు.
>
> సర్లేవోయ్,నేను లెక్కల్లో ఎప్పుడూ ఫెయిలయ్యేవాడ్నికదా..."అని నసిగాడు జూదగాడు.

"అయితే తప్పేమిటి ?"అన్నాను.

"తప్పేంలేదు—నాకు బావుండదు. పైగా ఆయనొస్తే నేనెందుకూ...చీర మార్చుకోడం ?"

"ఎవరైనా వస్తే కాస్త శుభ్రంగా కన్పిస్తే తప్పా ?"

"అంటే అంతకుముందు శుభ్రంగాలేనా? అయినా... నీ వేదో మారిపోయావు..." దుఃఖాన్ని గుటకలుగా మింగుతోంది.

"నేనేమీ మారలేదు— ఒకవేళ మారినా ప్రమాదకరమైన పని ఏదీ జరగబోవడం లేదు..."

దిండు మీద రాసూ వాల్చిన రెప్పలను మూసుకుంది.

నోటితో స్పష్టంగా చెప్పకపోయినా నా భావాలు ఆమెకు అర్థం అవుతున్నాయి...అదే నేను కొరుకునేది. వాసుకు ఇంకో పదిహేను రోజులు గడువుంది. ఈ లోగా ఏదో తేలిపోవాలి—సుందరిలో మార్పు తేవాలి...వాసుతో మాట్లాడేలాగాచేసి, వారిరువురికి మాట్లాడు కునేందుకు అవకాశాలు కల్పించాలి. సుందరికి నలుగురినీ...ముఖ్యంగా చక్రపాణినీ, భార్యనూ చూపాలి.

"సుందరీ..."

కళ్ళు తెరచి చూచింది.

'ఈ మధ్యేం...ఒక తమాషా జరిగింది...'

"........."

"మీ అన్నయ్య ఫ్రెండ్ ఒకాయన తన పెళ్లి అని పిలిచాడు..."

ఏమీ మాట్లాడకుండా నావైపే చూస్తోంది సుందరి.

"నేనూ మీ అన్నయ్య వెళ్లాం...ఆ పెళ్లి కూతుర్ని చూస్తే నువ్వే గుర్తొచ్చావు—అచ్చం నీలాగే ఉంది..." ఏ విషయంలో తవలాగో... విడమర్చలేదు—"ఇంతకీ విషయం ఏమిటంటే ఆవిడ మొదటి భర్త పాపం సడన్‌గా పోయారుట. మహాఅయితే ఆరు నెలలైనా కాపరం చేయలేదేమో...విజయవాడలో టీచర్‌గా ఉంటూండగా ఆయనకు పరిచయం అయిందిట. ఇష్టపడి...పెళ్లి చేసు కున్నారు..."

సుందరి నా వైపు నిశితంగా చూసి, "చదువుకున్నది కదూ...ఏదైనా చేస్తుంది" అంటూ ముఖంమీద మోచేయి కప్పేసుకుంది.

అంతటి ఉత్సాహం నీళ్ళు కారిపోయినా 'ఏం అందులో తప్పేమిటి...ఏదో కొద్ది నెలలు కాపరం చేసినంత మాత్రాన్న వాళ్ల మూలంగా వీళ్ల జీవితాన్ని నాశనం చేసేసు కోవడమేనా ? మొగవాడికి లేని తప్పు...ఆడ దాని కెందుకు ?" అన్నాను.

"ఇది తప్పు...ఇది ఒప్పు...అని మన పెద్దలు నిర్ణయం చేసాక...దాని బాగోగులు ఆలోచించడం నాకు చేతకాదు వదినా... మంచో చెడో...నలుగురూ నడచిన దారినే పోవడమే ఉత్తమం !"

స్థిరంగా పల్కుతున్న ఆమె స్వరాన్ని ఎలా మార్చగలనో తెలియడంలేదు. ఎప్పుడూ చకచకా మాట్లాడే నాకే మాటలు తడబడుతున్నాయి. ఆమె కంఠాన్ని మెచ్చుకోగలనేమో కానీ... ఆమె భావాల్ని ఆమోదించలేను—

# స్వయంకృతం

ఆమెతో ఇంకా వాదించాలంటే...ఆమె బాగా మారాలి... అప్పటిదాకా... నామాట వినదు.

'నాయనమ్మలో తిరుగుతున్నందుకు ఆ వాసనలు బాగానే వొంట పట్టించుకున్నావ్!' అని ఊరుకున్నాను.

నా మాట విన్పించిందో లేదో తెలియదు. మౌనంగా ఉండిపోయింది సుందరి.

మర్నాడు మధ్యాహ్నం... వాసు నిద్ర పోతున్న సమయంలో... సుందరిని పిలిచి... మధ్యాహ్నానికి టిఫెన్ చేయమనిచెప్పి ఆమెకు లేతరంగుల్లో నాలుగు చీరలు కొనాలనే ఉద్దేశ్యంతో బయలుదేరాను. అందరి ఆడ వాళ్ళలాగే చీరల కొట్లోకెడ్తే ఒకపట్టాన రాలేను నేను. ఎలాగో తెముల్చుకుని బయట పడేసర్కి నాలుగున్నర అయిపోయింది. పిల్లలు వచ్చేవేళయింది. ''సుందరేంచేస్తోందో...వాసు ఏమనుకుంటాడో...'' అనుకుంటూ చకచకా నడుస్తున్న నేను—ఏదో గుర్తొచ్చినట్లు ఆగి పోయాను. వంటరిగా ఉన్న అతనికి ఇష్టం ఉన్నా లేకపోయినా టిఫిన్ ఇస్తుంది సుందరి— ప్లేటు అందుకుంటున్న అతని చేతులవంక చూచాకయినా తప్పనిసరిగా అతని ముఖం పరిశీలిస్తుంది. అప్పుడైనా ... వయసులో ఉండే సహజ లక్షణాలవల్ల ఆమెలో మార్పురాదా?'

అలోచించిన కొద్దీ ఇంకో గంట ఆలస్యం చేస్తేనే నయమన్పించింది. పర్సులోని డబ్బు లెక్కచూసుకుని మళ్లీ బట్టలకొట్లోకెళ్లాను. అవసరంలేనప్పుడు పరిగెత్తే గడియారం — అవసరమైనప్పుడు ఆగిపోతుంది. ఎంతో బలవంతంమీద అరగంట గడిచింది — చీర లన్నీ కెలికేసి, ఒక్కచీరా తీసుకోలేదని కొట్టువాడు గొణుక్కుంటుండగా బయటకు వచ్చేసాను.

ఇల్లు చేరేసరికి ఐదున్నర అయింది. ఇంట్లో పిల్లలు చేస్తున్నగోల వీధిమొదట్లోకి విన్పిస్తోంది. అడవిలో జంతువుల్లాగా అదుపూ ఆజ్ఞా లేకుండా కొట్టుకుంటూ, అరచు కుంటున్నారు వాళ్ళు. సుందరి ఉండీ ... ఎలాఊరుకుందో ననుకుంటూ పాకెట్సు బల్లమీదనపెట్టి లోపలికి వెళ్లాను. వంటింట్లో ఏవో గిన్నెలు మూతపెట్టి ఉన్నాయి ఎవరూ లేరు

''వాసు ... '' పిలిచాను.

''మామయ్యా మేం వచ్చాక బయటికి వెళ్లాడమ్మా'' పెద్దాడు చెప్పాడు.

''మరి ... అత్త ... ?''

''తెలీదు''

అన్ని గదుల్లోను వెతికాను...ఇరుగు పొరుగిళ్లకు వెళ్లదామె. ఏదో అనుమానం వచ్చి పడకగదిలోకి వెళ్లి చూసాను.

ఆమె బట్టలు పెట్టుకునే పెట్టె ఖాళీగా వెక్కిరించింది. ఏదో చెప్పలేని భయం... వెన్నులోంచి! ఉత్తరం వంటిదేదైనా దొరుకు తుందేమోనని గదంతా వెతికాను ఎక్కడా ఏమీ లేదు.

పిల్లలకు టిఫిన్ పెట్టడాన్కి గిన్నెమూత తీయబోతే దానిమధ్య నలుగతూ కాగితం.

''ఎవరి రాత లెలా ఉంటాయో...అలాగే మనం నడుస్తాం...దానిని మార్చుకోవడం మనం చేయలేని పని. ఈ జీవితానికి ఇంతే రాసాడా భగవంతుడు. నిజంగా ఇంతకన్నా అధికం ఏదైనా ఉంటే నా 'రాతే' వేరుగా ఉండేది.

నీ అభిమానానికి కృతజ్ఞతలు-చెప్పకుండా వెళ్తున్నందుకు క్షమార్పణలూ చెప్పు కుంటున్నాను.''

సుందరి తెలివితక్కువ తనానికి బాధ పడాలో...ఏడ్వాలో తెలియలేదు.

''మనిషిలో సహజంగా మానసికమైన మార్పూ తెగింపూ వచ్చేదాకా సంస్కరణలతో కానీ సంస్కర్తలతో కానీ పనిలేదు'' అని శ్రీ వారెప్పుడో సుందరి విషయం ప్రారంభంలో అన్నమాట అక్షరాలా నిజం అన్పించింది. ★

(ఐపోయింది)

# పిల్లలకు నేర్పించవలసినవి ఎన్నో వున్నాయి




## కొన్ని కొన్ని వారే తెలుసుకుంటారు

ఏ మిఠాయిలు శ్రేష్ఠమైనవో లాగా... ఇది పిల్లలలో రూఢిగా జరిగే సంఘటన. బొంగరాలు, గోలీలు, క్యాండీలు నేర్పేదిదే. మధురపూరితమైన న్యూట్రిన్ మిఠాయిల శ్రేష్ఠత గురించి పిల్లలు చెప్పేటప్పుడు సరియైన కారణం వుందని మీరు ఒప్పుకోకతప్పదు.

స్వచ్ఛమైన పాలు, చక్కెర, తేనెల భరితమైన కాఫీ టాఫీలు, కోకోనట్ బాన్ బాన్‌లు, ఆరెంజ్ క్యాండీలు, ల్యాక్టో బాన్ బాన్‌లు—ఇవి కొన్ని రకాలు, పిల్లలు వీటిని వీడలేరు.




**న్యూట్రిన్** ఒక్కొక్క మిఠాయి యందు ఫలరస పూరిత విందు

న్యూట్రిన్ కన్ఫెక్షనరీ కంపెనీ ప్రైవేట్ లిమిటెడ్,
పలమనేర్ రోడ్, చిత్తూరు (ఆం.ప్ర.)

NCM-45/73 TEL




వర్షం జోరుగా కురుస్తోంది. గాలివిసురూ దానికి తగ్గట్టుగా జోరుగానే వుంది. అప్పటికి గంటపైగా వర్షం పడుతోంది. మధ్యమధ్య ఉరుములు గుండెలు ఝల్లుమనేలా వురుముతూన్నాయి.

వెంకటపతి బస్సుదిగి ఎవరిదో గొడుగు అరువుగాచేసుకొని, గొడుగు తాలూకు మనిషితోపాటుగా రోడ్డు కావలవైపునున్న 'కాకాహోటల్లోకి' అడుగు పెట్టాడు.

వర్షం ఓ దిక్కుగా కాకుండా ఎటుపడితే అటు కొట్టడంచేత అతని బట్టలు కొంత వరకు తడిసిపోయినాయి. వెంకటపతి చేతిలోని సంచీ తడవకుండా జాగ్రత్తపడ్డాడు. తలపైనించి కారుతున్న వర్షపు నీటిని చేత్తో తుడుచుకొని తలెత్తి చూశాడు. హోటల్లో రద్దీగావుంది. ప్రాకలోకూడా అక్కడక్కడ వర్షం కురుస్తోంది. వర్షపు బొట్లు చెక్కబల్లపైనపడి బల్లముందు కూర్చున్న అతని మొహంపైకి చిందుతోన్నాయి.

వెంకటపతికి ఆవూరు బదిలీ అయింది. కోర్టులో అమెండరుపని అతను చేసేది. మర్నాడు జాయినింగు రిపోర్టు ఇవ్వాలి.

వెంకటపతికి చిన్నప్పట్నుంచీ కూడా వర్షం అంటే తగని చిరాకు. తలతిప్పి బయటకి చూశాడు. ఇంకా వాన తగ్గలేదు. చూరు నించి వర్షపు నీళ్లు ధారగా పడుతున్నాయి. లోపల ఎంత జనం వున్నారో, బయటకూడా ఇంచుమించుగా తడికెలవాలులో తడవకుండా మరికొంతమంది జనం నించోని వున్నారు.

"అగ్గిపెట్టె వుందా?" ఎవరో అడిగితే తలెత్తి చూశాడు వెంకటపతి. మాసిన కాకీ నిక్కరు, ఆయిలు మరకలుపడ్డ చొక్కా, మెడలో ఓపాత తువాలు. లారీక్లీనర్లా వున్నాడు.

వెంకటపతి జేబులోంచి అగ్గిపెట్టె తీసిచ్చాడు అతనికి. బీడీ ముట్టించుకొని అగ్గిపెట్టె తిరిగి ఇచ్చేస్తూ వెంకటపతి మొహంలోకి చూశాడు వాడు. వెంకటపతి తనకేమీ పట్టనట్టుగా వూరుకొన్నాడు వాడు వెళ్లిపోయాడు.

వేడిగా 'టీ' తాగాలనిపించింది. మాసిపోయి మురికిగా, కొద్దిగా తడిసిన బట్టల్తో వున్న సర్వరు కుర్రాడికి చెప్పాడు 'టీ' కావాలని.

వర్షంచేస్తున్న అల్లరికంటే, పాకలో గందరగోళంగావుంది.

" వర్షంతగ్గితే వెళ్లిపోవచ్చు " అనుకొన్నాడు వెంకటపతి. కొన్ని క్షణాలక్రితం అగ్గిపెట్టె అడిగిన క్లీనరు పక్కనున్నవాడితో అంటున్నాడు.

"ఏటే నీ బండి కూడా పట్టేసినోడా?"

"అహాఁ నిచ్చేవంగా పట్టేసినాడు. అయినా దొంగసరుకొద్దెహె అని ఏడిత్తే యిన్నాడు కాదు నాయాల!" చెప్పాడు అవతల డ్రైవరు.

"ఎవడు? మీ ఓసరా?"

"అవును ఆడే చౌదరిగాడు. పిల్లా పాపా లేకపోయినా కడుపు మాడ్చుకుని, మరీ మూటలు కడుతున్నాడు మూటలు" కసిగా అన్నాడు.

అప్పుడు క్లీనరు కుర్రాడు కిసుక్కున నవ్వేడు

"అదేమరి. రేపు సత్తే తగలెట్టానికి కావాలిగంద రూపాయలు"

"నాయాల — ఎగిరెగిరి పడుతున్నాడు. దెబ్బతో పొగరణిగిపోతది" డ్రైవరు కసిగా తిడుతున్నాడు

"ఇంతకీ సరుకేంది మామా?" మరోడు చపాతీని నోట్లోకి కుక్కుకుంటూ అడిగేడు.

"బియ్యం."

•

—అప్పుడు వెంకటపతి బాధగా నవ్వుకొన్నాడు. పుట్టిన ప్రతివాడికీ బ్రతికె హక్కుంది. బ్రతకడానికి తిండి కావాలి. ఆ బియ్యపు గింజలు "దొంగజాతి"లో చేరిపోయి, సామాన్య ప్రజలకి అందుబాటులో లేకుండా పోతున్న ఈ గడ్డురోజులు తలంపుకొచ్చి, దానికి తనలాంటి వాళ్లు ఏంచెయ్యాలో తోచక తికమక పడిపోయాడు వెంకటపతి.

సర్వరు కుర్రాడిచ్చిన 'టీ'ని తాగి హోటలు బయటకొచ్చాడు. వర్షం తగ్గలేదు

పాక బయటవున్న బహుకొద్ది జాగాలో, పలుగురు కుర్రాళ్లు మూలగా కూర్చుని,

పదిహేనిల్లతో బొమ్మా—బొరుసు ఆట ఆడుకొంటున్నారు.

వాళ్ల మొహాలు చూస్తుంటే 'పసివెధవలు' పాపం అనిపిస్తుంది. కానీ ఎదుటివాడి సొమ్మని అక్రమంగా కాజేయాలన్న తలంపు, తపన, కాంక్ష, ఆ పసిమొహాల్లో, ఆ చిన్నవయసులోనే కనబడేసరికి వెంకటపతికి కోపంతో వళ్లు వేడెక్కి పోయింది.

ప్రతి మనిషీ బ్రతుకుతెరువు కోసం కష్టపడాలి. కానీ ఈ దేశంలో కుటుంబంలో కష్టపడేది ఒకడు. ఇంటి యజమాని అని ఒక పోర్టుఫోలియో ఇచ్చి వాడిమీద ఆధారపడే వాళ్లు ఎక్కువ. సోమరిపోతుల్లా, కాలయాపన చేయక, తోచిన పనిచేసి, కుటుంబానికి చేదోడు వాదోడుగా, ఆదుకోటం తప్పేమీ కాదు.

వెంకటపతి సిగరెట్టు వెలిగించేడు.

వర్షం జోరుచూస్తుంటే ఇప్పుడిప్పుడే తగ్గేలాలేదు. గుండెలవిసేలా ఓ వురుము వురిమింది. మెరపొకటి చాకులా తళతళమని మెరిసింది.

వెంకటపతి సిగరట్టు పొగని దట్టంగా వదిలేడు. వీస్తున్న విపరీతమైన గాలికి ఆ పొగ ఒక్కసారిగా చెదిరిపోయింది. రోడ్డు మీద నీరు వరదలా పారుతోంది.

వెంకటపతి రోడ్డువేపు చూసేడు.

పూర్తి లోడులో ఓ లారీ, రోడ్డుపైని నీళ్లని కోసుకొంటూవచ్చి, ఆ టాకా హోటలు ముందు ఆగింది.

లారీవైపర్స్ పనిచెయ్యడం లేదులా వుంది. క్లీనరు దిగి పాతగుడ్డతో, విండ్‌స్క్రీన్ తుడిచాడు. డ్రైవరు బండి దిగలేదు. క్లీనర్ నెత్తిన ఓ పాత తువాలు కప్పుకొని, హోటల్లోకి పరుగెత్తు కొచ్చాడు. హోటల్లోంచి ఓ గ్లాసుపైన చెయ్యి అడ్డుపెట్టి 'టీ' తీసుకెళ్లి డ్రైవరు కిచ్చాడు. డ్రైవరు ఏదో అంటున్నాడులా వుంది క్లీనరు కుర్రాడు నవ్వుతోన్నాడు.

వెంకటపతి ఆలోచనల్లోంచితేరుకొన్నాడు. ముందుగా ప్లీడరు గారింటికి వెళ్లాలి. ఆయనకి ముందే చెప్పుకొన్నాడు ఓ గదిచూసి పెట్టమని. గది ఎక్కడుందీ, ఎలా వుంటుందో ముందు తెలుసుకొంటే తర్వాత 'సామాను' అదీ తెచ్చుకోవచ్చని ఓ రెండు జతల బట్టలతో మాత్రం వచ్చేశాడు.

వెంకటపతి చూరుకింద నించి కొంచెం అవతలికి నడిచేడు. అక్కడ ఓ మల్లెపూల అంగడి వుంది.

అంగడిపైన ఓ బొమ్మ కళ్లు చెదిరి పోయేలా తళతళ మెరిసిపోతూ కనబడింది.

వెంకటపతి తన చూపుని ఆపిల్లపైనించి ఓపట్టాన మరల్చుకోలేక పోయాడు. అంగడి ముందున్న బల్ల ఎత్తుగావుండి మల్లెపూల దొంతర్లు, గుట్టగా పడివుండడంచేత, ఆ బొమ్మ పూర్తిగా కనబడ్డంలేదు. పూలు పొట్లాలుకట్టే హడావుడిలో వుందామ్మాయి.

వెంకటపతికి పూలు కొనాలనిపించింది. అంతలోనే నవ్వుకొన్నాడు.

"తనకి పూలెందుకు ?"

"ఏం చేసుకోవాలి ?"

కారణం తెలీకుండానే వెళ్లి అంగడిముందు నించోవాలనిపించింది. ఊళ్లోకి వచ్చి రాందేనే, తనకిలాంటి బుద్ధి కలిగిందేమిటని ఆశ్చర్య పడ్డాడు.

> 'అయ్యా, మీరు తినటం, తాగటం తగ్గించాలి, విశ్రాంతి తీసుకొనటం కూడా తగ్గించాలి !' అని సలహా చెప్పాడు డాక్టరు రామారావుకి.
>
> "అలాగే సార్—మీదస్తూరీతోనే మీ లెటర్‌హెడ్‌మీద రాసివ్వండి, సెలవు చీటీతో బాటు ఇచ్చుకుంటాను" అన్నాడు రా. రా.

—'అంగడి వెనక లోపలగా' మరోగది వున్నట్టుగా ఓ తడిక అడ్డంపెట్టివుంది దానికి ఓ తలుపు. అంటే అదే ఆపిల్లకి ఇల్లుకూడా అయివుంటుందనుకొన్నాడు.

అంగడిముందు ఇప్పుడు ఎవ్వరూ లేరు. వెంకటపతిని చూసి పలకరింపుగా అడిగిందామ్మాయి.

"ఏంబాబుగోరు. మల్లెమొగ్గలుకావాలా?"

వెంకటపతినవ్వి అన్నాడు.

"వంటరి వాడిని. మల్లె మొగ్గలు కొని మాత్రం ఏం చేసుకోను !"

"దేవుడికి వెయ్యొచ్చునుగా !"

"నాగదిలోకి దేవుడుగానీ, దేవతగానీ ఇంకా రాలేదు. నేను వంటరి వాడిని. కొత్తగా వచ్చానీవూరు" చెప్పాడు.

ఆ పిల్ల అంతలోనే తిరిగి బేరంలో పడి పోయింది.

వర్షం తగ్గింది. కానీ రోడ్డుమీద నీరు మాత్రం విపరీతంగా ప్రవహిస్తోంది.

కాలం కాని కాలంలో ఈ వర్షం ఏమిటో అతనికి అర్థం కాలేదు. అక్కడ్నుంచి వెళ్ళగా కదిలేడు.

—ప్లీడరుగారింటికి తెలికగానే! 'చేరాడు వెంకటపతి. అమీనా రంగరాజుని తోడిచ్చి పంపేరు ప్లీడరుగారు.

గది బాగానేవుంది.

అద్దె పాతికరూపాయలు.

'ఫర్లేదు' అనుకొన్నాడు.

రంగరాజు సన్నగా పొడుగ్గా వున్నాడు. అతనికి నలభై ఏళ్లుంటాయి. అప్పుడే జుత్తు నెరిసిందతనికి. కండలు హారాయించుకొని పోయి చర్మం, అస్థిపంజరానికి చుట్టుకొని పోయినట్టుగా కనబడుతోంది. అది అతను చేసిన మంచికీ చెడుకీ ఫలితంలా అనిపించింది.

రంగరాజు వసపోసినట్టుగా మాట్లాడతాడు.

"నువ్వొచ్చింది ఈ వేళనే కనక రాత్రికి నా ఇంట్లో భోజనానికి ఏర్పాటు చేశాను. రేపట్నుంచీ ఎలాగూ హోటలు మెతుకులు తప్పవనుకో" అన్నాడు రంగరాజు.

"అబ్బే, ఎందుకులెండి" మొహమాటం పోయాడు వెంకటపతి.

"చూడు కుర్రోడా, ఈ రంగరాజు ఒకరికి చెప్పడమేకానీ, చెప్పించుకొనే రకంకాదు. ఈ ముసలి అవతారంచూచి, నన్ను తేలిగ్గా కొట్టిపారేయకు. ఈ వూళ్ళో ప్లీడరుగారూ, మేస్ట్రీటుగారూ, ఇనస్పెక్టరుగారూ, సినిమా హాలు మేనేజరు, ఆఖరికి బట్టల కొట్టు సుబ్బయ్యా మిగిలిన షావుకార్లు కూడా, మన మాటకి తలొంచేస్తారు."

"చాలా సంతోషం"

"అవునుగానీ, ఇంతకీ భోజనానికి వస్తున్నట్టేగా ? నాకు తెలుసునయ్యా. కుర్రాళ్లుముందు సిగ్గుపడతారు. చూడు, ఓ సిగరెట్టువుందా ?" అడిగేడు రంగరాజు.

"వుంది" అన్నాడు.

"పదేయ్ ఒకటి" అంటూ అతను అందించిన సిగరెట్టును తీసుకొన్నాడు—స్నానం అదీ ముగించి రంగరాజు వెంట బయల్దేరాడు.

—వారం గడిచింది. వెంకటపతి వూరెళ్లి మిగిలిన సామాను తెచ్చుకొన్నాడు. రంగరాజు చెప్పుకున్నట్టుగా అతను తక్కువవాడేమీ కాదని వెంకటపతి త్వరలోనే గ్రహించాడు. వెంకటపతికి సబ్‌ఇనస్పెక్టరు రెడ్డి కూడా

## దోసెడు మల్లెలు

పరిచయం అయ్యాడు. వెంకటపతి సాయంత్రంపూట, కాలక్షేపానికి, సినిమా హాలుకిగానీ, పోలీసుస్టేషనుకిగానీ పోయి కూర్చోడం అలవాటు చేసుకొన్నాడు. కొత్త స్నేహాలు అవుతున్నాయి. 'ఊరు ఫర్లేదు' అనుకొన్నాడు. కాకపోతే ఎండలు ఎక్కువ. అవూరనే ఏమిటి ఎండాకాలంలో ఎక్కడైనా ఎండలుంటాయి. కాకపోతే కొండప్రదేశం అవడంచేత మరికొంత పెట్రేగిపోతోంది.

" అతను బట్టలకొట్టు సుబ్బయ్య, " రంగరాజు సుబ్బయ్యని పరిచయం చేశాడు.

సుబ్బయ్య వెకిలిగానవ్వి.

"ఓసారి షాపుకి దయచేయండి" అన్నాడు.

రంగరాజు అందుకొన్నాడు.

"సుబ్బయ్యగారి కొట్లో అందరికీ ఖాతా దొరకదు. ఖాతావున్న వాళ్లని చేతివేళ్లపైన లెక్కెట్టచ్చు. సుబ్బయ్యకొట్లో ఖాతావుంటే వాడు చాలా పలుకుబడి గలవాడన్నమాట".

"ప్రస్తుతం నాకు అవసరంలేదు. కావాలంటే వెళదాంలెండి". అన్నాడు వెంకటపతి.

సుబ్బయ్య వెళ్ళిపోయాడు.

"కొంతసేపు సినిమా చూసిపోదాంపద" అన్నాడు రంగరాజు. అతనితోపాటుగా సినిమా హాలు దగ్గరకి వెళ్ళాడు వెంకటపతి.

సినిమాహాలు మైకులోంచి అరిగిపోయిన పాత గ్రామఫోను రికార్డు పాటలు వినవస్తున్నాయి. ఆట యింకా మొదలుపెట్టలేదు. సమితి ప్రెసిడెంటు వస్తున్నానని కబురు చేశాడట. అంచేత ఇంకా మొదలు పెట్టలేదు సినిమా. చిన్న వూళ్లలో అదో ఆనవాయితీ. వూరిపెద్దలెవరన్నా, సినిమాకి వస్తున్నట్టు కబురుచేస్తే వాళ్ళువచ్చేవరకూ సినిమా మొదలుపెట్టరు.

మెల్లగా జనం చేరుతున్నారింకాను. హాలు బయట వేరుశనగకాయలు అమ్మే కుర్రాడు, ముంతమసాల బండి వున్నాయి. కొంతమంది పిల్లలు మసాలాబండిచుట్టు మూగివున్నారు.

ఏడవుతున్నా ఎండ తాలూకు వేడిగాలి ఇంకా కొడుతూనే వుంది.

అక్కడ 'ఆరుబయట' వున్న ఓ చక్కబల్లపైన వెంకటపతీ, రంగరాజూ కూర్చున్నారు.

ఆసమయంలో హాలుముందునించి మాంచి వయసులోవున్న ఓ బంతి పువ్వు కదిలి వెడు

తుంటే రంగరాజు వెంకటపతి తొడపైన కొట్టి చూపించాడు.

"దాన్ని చూడు!" అన్నాడు.

"ఎవరు ?" అడిగేడు.

"మంగమ్మని ఓ దొంగముండ, ఈ పూళ్ళో చాలా మందిని ముంచిరిదిలే. ఈమధ్యనే కంట్రాక్టరు సూరయ్య వుంచు కొన్నాడు."

"సూరయ్యగారా ?"

"అవును ఈమధ్య అడికి పక్షవాతం రావ డంతో ఎవడో కొత్తోడ్ని పట్టిందిట" అన్నాడు రంగరాజు.

"చాలా అందంగావుంది."

"అదెట్టుకొనే బతుకుతోంది. ముందు దాన్ని ఈవూర్లోచౌదరిగారు పెట్టుకొన్నాడు. తర్వాత, తర్వాత, చేతులు మారిమారి....."

"పాపం" అన్నాడు వెంకటపతి.

"దానిదగ్గర ఓనీతిగుణం వుంది కుర్రోడా, ఒకడితో వున్నప్పుడు సాక్షాత్తు పతివ్రతలా వుంటుంది. మరో పురుగెంక ఛస్తే కన్నెత్తి చూడదు."

"పిల్లలువ్నారా ?"

రంగరాజు వికారంగా నవ్వేడు.

"పువ్వులు పుయ్యించొచ్చు. కానీ పూయ నిస్తేగదా!" రంగరాజు చమత్కారానికి వెంకట పతికి నవ్వొచ్చింది. అతను లేచినించున్నాడు.

"అదేం లేచి వించున్నావ్ ?"

"వెళతాను అలా బస్టాండువరకుపోయి, గదికి పోతాను."

"సరే వెళ్లు" అన్నాడు రంగరాజు.

—వెంకటపతికి పువ్వుల అంగడి గుర్తు కొచ్చింది. మల్లెలరాసి వెనక అపిల్ల కూర్చునే వుంది.

ఉత్సాహంగా అడుగులు వేశాడువెంకటపతి.

అంగడి దగ్గర పూలు కొంటున్న బేరగా ళ్ళున్నారు. జనం తగ్గేవరకూ వూరుకొని, తర్వాత వెళ్ళి అడిగేడు.

"ఓ పావలాపూలు ఇవ్వు."

మల్లె మొగ్గలు పొట్లంకట్టి ఇస్తూ.

'వంటరిమనిషివని చెప్పారు. పూలేం చేస్తారు" అడిగింది పూలమ్మే ఆపిల్ల.

తవని ఆపిల్ల ఇంకా గుర్తుంచుకొన్నదన్న విషయం తెలియగానే వెంకటపతికి ఏనుగెక్కి నంత సంబరం కలిగింది.

"వంటరివాళ్ళకి పువ్వుల్ని ఆరాధించే అధి కారం, ఆస్వాదించే హక్కు వుండకూడదా ?" అడిగేడు.

పువ్వులు అమ్మే ఆ పిల్ల సుకుమారంగా నవ్వింది.

అప్పుడు ఆ పిల్ల కనురెప్పలు కొన్ని క్షణాల పాటు రపరపమని కొట్టుకొన్నాయి. బుగ్గలు

(33వ పేజీ చూడండి)

గ్రాము: "ఘరానాదొంగ" ఫోన్: 347604/. .420.

# శ్రీ చోర నారాయణ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ పోస్టు గ్రాడ్యుయేట్ సెంటర్

అత్యుత్తమ శిక్షణ! విద్యార్థులపై ప్రత్యేక శ్రద్ధ!!

## గ్యారంటీ ప్యాసు!!!

**మేము శిక్షణ ఇచ్చు కోర్సులు:**

(i) 3 సంవత్సరముల డిప్లొమా కోర్సు: స్టేట్ మరియు సెంట్రల్ ప్రభుత్వముచే డిగ్రీగా, గుర్తించబడిన కోర్సు. ఇంటి చువ్వలు వంచుట, తాళములు పగులగొట్టుట, మారు తాళములు చేయుట.

(ii) 9 నెలల సర్టిఫికెటు కోర్సు: దొంగ వ్యాపారము, బ్లాక్ మెయిల్, కల్తీవ్యాపారము.

(iii) 6 నెలల కరెస్పాండెన్సు కోర్సు: ఇంటివద్దనుండే చదివి, పరీక్ష వ్రాయువచ్చును. దొంగసారా మార్కెట్టుచేయు విధములు, అధికారులను వశపరచుకొను మార్గములు.

(iv) లండన్ డిప్లొమా: ఇండియా మరియు ఇతర దేశములలో గుర్తింపబడినది. విగ్రహముల చేరవేత, అదృశ్య దొంగతనము మొదలైనవి.

**ఇంతేగాక** (అ) యువకులకు, ఉత్సాహవంతులకు సొంత వ్యాపారము సులభముగా ఆరంభించుటకు కొన్ని షార్టు టెర్మ్ కోర్సులు.
(ఆ) 3 నెలలలో ఫోర్జరీ మరియు స్వల్ప దొంగతనములలో పూర్తిగా కండెన్సుడు కోర్సు.

**మా ప్రత్యేకతలు:**

(అ) హాస్టలు వసతి కలదు.
ఆ) స్త్రీలకు ప్రత్యేకముగా స్త్రీలచే నేర్పబడును.
(ఇ) రాత్రి మరియు పగలు తరగతులు కలవు. రాత్రి తరగతులలో ర్యాంకీ మరియు పిక్‌పాకెట్ విద్య నేర్పుటకు అనుభవము గడించిన ప్రొఫెసర్లు కలరు.
(ఈ) మీ ఉత్తరములన్నియు చాలా కాన్ఫిడెన్షియల్‌గా వుంచగలము.

**చార్జీలు:** లూటీ చేసిన సొమ్ములో 70% మాత్రం.

**కనీస అర్హతలు:** పై కోర్సులకు, అప్లయి చేయు విద్యార్థులు కనీసం ఒకటి, రెండుసార్లయినా పట్టుబడి యుండవలెను. వయస్సు పరిమితి 22 జనవరి 1974 నాటికి 15 నుండి 22 సంవత్సరముల లోపు వుండవలెను. ఈ కనిష్ట, గరిష్ట వయోపరిమితి షెడ్యూలు కులమునకుగాని, షెడ్యూలు తెగవారికి 5 సంవత్సరములు పెంచబడును. రెండు మూడుసార్లు పట్టుబడి శ్రీకృష్ణ జన్మస్థానమునుండి తిరిగి వచ్చినవారికి ఈ వయో పరిమితి వర్తించదు. వారికై 50% సీట్లు కేటాయించబడినవి.

**గమనిక:** పై కోర్సులన్నింటికి థియొరీ, ప్రాక్టికల్సు కలవు.

***ఆలశించిన ఆశాభంగము!*** ***కొద్ది సీట్లు మాత్రమే కలవు!!***

క్లాసులు 22 జనవరి 1974, 10 గంటలకు ఆరంభమగును.

పూర్తి వివరములకు, తమ పూర్తి అంశముల పేర్కొని, స్వంత చిరునామా గల కవరుతో, దొంగిలింపబడిన స్టాంపుతో (విలువ ఒక రూపాయి మాత్రం) సంప్రదించవచ్చును.

డైరెక్టరు,
శ్రీ చోర నారాయణ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ పోస్టు గ్రాడ్యుయేట్ సెంటర్,
1–44–7, దొంగలబజార్,
వస్తాదు కాలనీ, నారాయణనగర్.

సత్యమేవ అపజయతే — మా సిద్ధాంతం.

గాంధి సూత్రములే వర్జించబడు మా ఏకైక సంస్థలో గరువు విద్యా బోధనలో మీకు పూర్తి రక్షణ కలదు.

ప్రకటన కర్త: "చంద్రన్"
మద్రాసు–24.

# సువర్ణ సుందరికి సుగంధ చందనం

చందనము, విదేశ సువాసన ద్రవ్యములు, అమూల్య మూలికలను చేకూర్చి, మైక్రోఫైన్ పద్ధతిలో తయారుచేయబడినది, గోకుల్ సాన్‌టాల్ టాయలెట్ పౌడరు. వేసవి కాలంలో చలవ చేకూర్చటానికి, రోజంతా మిమ్మల్ని కమ్మగా ఉంచటానికి, మీ శరీరమంతా గోకుల్ సాన్‌టాల్ టాయలెట్ పౌడరును వాడండి. చందన లోకంలో విహరించండి.

## గోకుల్






సాన్‌టాల్ టాయులెట్ పౌడరు
టి.యస్.ఆర్. & కంపెని, మద్రాసు
వారి ప్రత్యేక తయారింపు
గోకుల్ ఒక సుగంధ స్వానుభవం

తయారీటు
టి.యస్.ఆర్. &
కంపెని,
మద్రాసు
రామావరం
మద్రాసు-600089

# సిమీ బ్యూటీ బులెటిన్

లేక

## అందానికి చిట్కాలు

అందాల తార సిమీ అందానికి, ఫాషన్‌కి తగిన చిట్కాలు తెలుపుతుంది వ్యక్తిగత మయిన ప్రశ్నలకి సమాధానాలు ఇవ్వలేనని తెలుపటానికి ఆమె చింతిస్తోంది! సాధారణంగా అందరికీ ఉపయోగంగా ఉండే ప్రశ్నలనే 'SIMI'S BEAUTY BULLETIN, Post Bag No 7117, BOMBAY 400014 కి పంపవచ్చు.

ప్ర: రోజూ నూనె రాసుకుంటున్నా వెంట్రుకలు రాలిపోతున్నాయి, ఏం చెయ్యమంటారు?

జ: మీరు ఏమి నూనె వాడుతున్నారు? రాసుకున్న నూనె మీకు సరిపడకపోవచ్చు. ఆల్మాండ్ ఆయిల్ వాడిచూడండి. ఆహారంలో విటమినులు వుండేలా ముఖ్యంగా 'ఎ' విటమిను వుండే ఆహారం తీసుకోండి. పాలు, పళ్ళు, 'ఎ' విటమిను టాబ్లెట్లు రోజూ ఒక నెల్నాళ్ల పాటు తీసుకోండి. ఆరోగ్యం సరిగా లేకపోయినా వెంట్రుకలు రాలిపోతాయి. డాక్టరుని సంప్రదించండి.

ప్ర: నాశరీరం 30–23–34 సైజులో వుంటుంది. ఛాతీ పెరగాలంటే ఏం చెయ్యాలి?

జ: ఛాతీ మీద కండరాలు పెరగాలంటే రెండు ఎక్సర్‌సైజులున్నాయి. చేసి చూడండి. 1. మీ మునివేళ్ళ భుజాల మీద వేసుకోండి. మోచేతిని వలయాకారంలో తిప్పండి. 2. చేతులు చాపి నిలబడండి. చేతులు పైకి వూపండి. రెండు చేతులూ తలమీదకివచ్చేలా— రెండు చేతులూ కలిసి ఒక వలయం ఏర్పడేలా వూపండి. వీలయినప్పుడల్లా ఈత ఈదండి ఇది చాలా మంచి వ్యాయామం.

ప్ర: మొదటి బిడ్డను ప్రసవించిన తర్వాత నా కడుపుమీద చారలు బయలు దేరాయి. అవి పోవాలంటే ఏం చెయ్యాలి?

జ: ఈచారలు సర్వసాధారణంగా వస్తాయి. ఎక్కువ బరువును సంతరించుకున్నప్పుడు శరీరం పలచబడుతుంది. మళ్లీ తగ్గినప్పుడు అవి చారలుగా వుండిపోతాయి. ఇవి తగ్గాలంటే కొంతకాలం పడుతుంది. నూనె మర్దన చెయ్యడంవల్ల కొంత గుణం కనిపించవచ్చు. చేతులు చాపే వ్యాయామం కూడా మంచిదే.

ప్ర: ఇంట్లో. ఒక 'కోటు' తయారు చేసుకోవాలని వుంది. ఏదైనా డిజైను చెప్పండి.

జ: 'కిమినో' ప్రయత్నించి చూడండి. ఈ జపనీస్ మోడల్ మనదేశం స్త్రీలకి బాగా నప్పుతుంది. చల్లగాను, సుఖంగాను, స్త్రీలకి ప్రత్యేకంగాను వుంటుంది.

ప్ర: 'మెడికేటెడ్ సోపు'ని ఉపయోగించండి అని రాస్తూ వుంటారు. అంటే ఏమిటి?

జ: 'ఈ మెడికేటెడ్ సోప్' అనేది జిడ్డోడుతున్న శరీరాలకి బాగా పనిచేస్తుంది. మొటిమలని పోగొట్టేశక్తి ఇందులోవుంది. అయితే రోజుకి మూడుసార్లుకంటే ఎక్కువ ఉపయోగించకూడదు. లేకపోతే చర్మం పొడారిపోతుంది. పొడి చర్మంమీద గీతలు ముడతలు ఇట్టే బయలుదేరతాయి.

ప్ర: నా బట్టల మీద కొంచెం టీ వలకబోసుకున్నాను. మచ్చలని పోగొట్టాలంటే ఏం చెయ్యాలి?

జ: వెంటనే కడిగివేస్తే పోతుంది. ఆరిపోతేమాత్రం చాలా కష్టం. బ్లీచింగ్ ద్రవంలో ఒకగంటసేపు నాననివ్వండి (తెలుపు అయితేనేసుమా) రంగు బట్టలయితే గ్లిసరిన్ రాసి కొంతసేపు ఆగనివ్వండి. తర్వాత సబ్బు నీళ్లతో ఉతికి వేస్తే ఈ మచ్చలు పోతాయి.

ప్ర: గోళ్లకి 'వార్నిష్' అంటే ఏమిటి?

జ: గోళ్ల పాలిష్‌కే ఇది మరొక పేరు. బాగా ఏపుగా పెరిగిన గోళ్లకి ఈ వార్నిష్ వేస్తే చాలా బాగుంటుంది. పచ్చటి రంగులు అంత బాగావుండవుగాని—ముదురు రంగులు చాలా దొరుకుతున్నయి. అవి బాగుంటాయి. కాళ్లకి కూడా ఇదేరంగు వాడితే మంచిది. రెండు రంగులు ఎప్పుడూ ఉపయోగించకూడదు.

నేను కరుణాశ్రమంలోకి అడుగు పెట్టేసరికి బాబాజీ గొంతు గుడిగంటలా "ఖంగు"మని మ్రోగుతోంది.

"...మానవుని కోరికే అతని దుఃఖానికి హేతువవుతుంది. మనిషి దేనినయితే అమితంగా ప్రేమిస్తాడో, తిరిగి దానివల్లనే అతను దుఃఖపడతాడు..."

గుమ్మందగ్గర నిలుచున్న నన్ను చూసి బాబాజీ ఒక్కక్షణం ఆగారు. నేను వారికి నిశ్శబ్దంగా నమస్కరించాను. "రా బాబూ లోనికి" అంటూ చిరునవ్వుతో లోనికి ఆహ్వానించారు. నేను వెళ్ళి అక్కడున్న జనానికి ఓ వయిపుగా కూర్చున్నాను. మరో అయిదు నిమిషల్లో ఆ పూటకి చేయవలసిన బోధన పూర్తయింది. అంతా వెళ్లిపోయారు. నేనూ బాబాజీ మాత్రం మిగిలాం అక్కడ.

"ఏం బాబూ, ఎవరైనా దొంగని వెతుకుతూ ఇటు వచ్చావా?" అన్నారు బాబాజీ గంభీరంగా. నాకు ఆశ్చర్యం వేసింది. నేను పోలీసాఫీసర్నని వారికేం తెలును? అదే అడిగాను.

"అదొక విశేషంకాదు బాబూ, నీ రూపం, నీ చూపు, నువ్వో పోలీసాఫీసరువని యిట్టే చెప్తున్నాయి...ఇంతకీ నీ రాకక్కారణం...?"

"నేను పారిపోయిన దొంగల్ని వెదుకుతూ రాలేదు బాబాజీ కోల్పోయిన మనశ్శాంతిని వెదుక్కుంటూ వచ్చాను. ప్రస్తుతం శెలవులో వున్నాను. కొన్నాళ్లపాటు యిక్కడే వుండాలని..." నా మాటలకి ఆయన క్షణకాలంపాటు కన్నులు మూసుకుని — తర్వాత "ఇక్కడ నీకు మనశ్శాంతి దొరుకుతుందని ఎవరు చెప్పారు?" అన్నారు.

"పరితప్త హృదయాలకు పిడికెడు శాంతి యిక్కడ లభిస్తుందని ఓ మిత్రుడు చెప్పగా వచ్చాను." — అన్నాను నేను వినయంగా.

"మంచిది—నీ నమ్మకమే నీకు మనశ్శాంతి నిస్తుంది. కర్తవ్యభారంతో అలిసిపోయిన నీకు నిజమయిన శాంతి లభించాలని ఆ మురలీమోహనుణ్ణే ప్రార్థిస్తాను."

"నా ఉద్యోగభారం వలన వచ్చిన క్లేశం కాదిది. మనసువున్న మనిషిగా నేను బాధ పొందుతున్నాను ... అది తమకు చెప్పి..."— నేను

"అలాగే కానిద్దువులే బాబూ, ముందు వెళ్లి నీ వసతి వగైరాలు చూసుకో. మధ్యాహ్నం తీరిగ్గా మాట్లాడదాం..." —

# పరాజితులు

యస్. కాశీవిశ్వనాథం



అని బాబాజి రాంగోపాల్ అనే వ్యక్తిని పిలిచి, నాకు వసతి వగైరాలు చూడమని పురమాయించారు.

*　　*　　*

వసతి యిచ్చిన గదిలో నా పెట్టె, బెడ్డింగు పెట్టుకున్నాక ఆశ్రమం అంతా కలియదిరిగాను. కల్తీలేని ప్రశాంతత ఆశ్రమమంతా పరుచుకుని వుంది. ఎక్కడో కథల్లో చదివినట్టు, చిత్రాల్లో చూసినట్టు పవిత్ర మునివాటికలా వుందా ఆశ్రమం. ఓ మూల ఆరోగ్యంగా వున్న ఆవులు, మరోవయిపు ఎన్నో కొబ్బరిచెట్లు వున్నాయి. మరెన్నో పూలమొక్కలు వున్నాయి. చెట్టు చెట్టున ప్రశాంతత, పువ్వు పువ్వున పవిత్రత వుట్టి పడుతున్నాయి. ఆశ్రమానికి అల్లంత దూరంలో చేయిజాచి పిలుస్తున్న కన్నతల్లి మనసులాంటి అనంతసాగరముంది. బాబాజీ వేదాంతిమాత్రమే గాక, ప్రకృతి చికిత్స నిపుణులు. కొంతమంది రోగులు అక్కడే వుండిపోయి చికిత్స పొందుతున్నారు. వారికి బాబాజీ మందులద్వారా కాక, కేవలం కొన్ని వ్యాయామాల ద్వారా అంటే యోగాసనాల ద్వారా నయం చేస్తారట. నిమ్మరసం, తేనె, కొబ్బరినీరు, చన్నీటిస్నానం, యిలాంటి ప్రకృతిసిద్ధంగా లభ్యమయే అతి సామాన్యమయిన వస్తువులతోనే ఎలాంటి జటిలమయిన రోగాన్నయినా బాగుచేస్తారట. ఇవిగాక ప్రతినిత్యం ప్రార్థనలు వుంటాయి.

రోగులు వున్న గదులవయపు వెళ్లాను. వారు శరీరకంగా బలహీనంగా వున్నా, ముఖాలు మాత్రం ఆనందంలో వెలుగుతున్నాయి. వారిలో కొంతమందిని కుశల ప్రశ్నలు వేసాను. వారి మాటల్లో "బాబాజీ దేవుడే" అన్న భావం గోచరమయింది.

మధ్యాహ్నం మూడు గంటలప్పుడు బాబాజీ మందిరానికి వెళ్లాను. బాబాజీ నిద్రపోతున్నారేమోనని తటపటాయించి గుమ్మంలో నిలబడ్డాను. "రా బాబూ లోనికి" -- అన్నారు గంభీరంగా. లోనికి వెళ్లాను. ఆ సమయంలో వారు దినపత్రిక చదువుతున్నారు. "తమరు నిద్రపోతున్నారేమోనని సంశయించాను"— అంటూ కూర్చున్నాను. "లేదు బాబూ, నేను పగలు నిద్రపోను. అసలు పగటి నిద్ర ఎవరికీ మంచిది కాదు." — అని రెండు నిమిషాలపాటు రెప్ప వెయ్యకుండా శూన్యంలోకి చూస్తూ "నువ్వు కడుపు శోకంతో వచ్చావుకదూ?" — అని ప్రశ్నించారు. నేను ఆశ్చర్యపోయాను. బాబాజీ మహాన్వితులేకాక, మంత్రసిద్ధులు కూడానేమో అనిపించింది. "అవును బాబాజీ, చేతికందిన కొడుకు, మరో రెండు సంవత్సరాల్లో డాక్టరు కాబోతున్న కొడుకు సరదాగా తప్పిపోయాడు, ఆత్మహత్య చేసుకుని చచ్చిపోయాడు. ప్రేమించిన అమ్మాయి మరొకర్ని పెళ్లి చేసుకుందన్న బాధతో విషం తాగి చచ్చిపోయాడు. నా భార్య పోయి చాలా కాల మయింది. చెప్పుకోదగ్గ బంధువులెవరూ లేరు. చీకటి ఆయిముకున్న బ్రతుకులో నా కొడుకు దీపం వెలిగిస్తాడనుకున్నాను గాని, చీకటిని మరింత చిక్కబరచి, నా గుండెల్లో చిచ్చుపెట్టి వెళ్లిపోతాడనుకోలేదు. బ్రతుకు మీద విరక్తి కలుగుతోంది. ఉద్యోగం రిజైన్ చేసేసి ప్రశాంతంగా ఎక్కడయినా వుండిపోదామా అన్న ఆలోచనలో వున్నాను. ప్రస్తుతం శెలవుపెట్టి యిక్కడికొచ్చాను." నాకు తెలియకుండానే నా కళ్లు చెమర్చాయి.

అంతా విన్నాక వారు శాంత గంభీర స్వరంతో అన్నారు. ''మానవ సహజమయిన బలహీనత నిన్నూ ఆవహించింది, నిన్ను లొంగదీసుకుంది. నీ కడుపుశోకం తీరేది కాదు. నిజమే! కాని, నీదికాని యీ లోకం నించి నీకంటే ముందు మరోకరు శాశ్వతానందలోకాలకు వెళ్లిపోయినందుకు నువ్వు విచారిస్తున్నావంటే, మాయా మేయ బంధుర మయిన యీ లోకం నీమీద విసిరిన భ్రమల వలనించి నువ్వింకా తప్పుకోలేదన్న మాట. ఈ జగత్తులో ఏది శాశ్వతం? నీరు శాశ్వతమా? అంతలో వుద్భవించి అల్లంతలోనే మాయమయే బుద్బుదం శాశ్వతమా? బుద్బుదాలు శాశ్వతమని భ్రమసి, భ్రమలు పెంచుకుని బాధనొందడం వుత్తముల లక్షణంకాదు. భగవానుడు గీతలో ఏమన్నాడు? సర్వం నేనే అనలేదా? సృష్టిస్థితిలయాలకు కారణభూతుడను నేనే అన్నాడు. నీ కొచ్చే కష్టానికి, నష్టానికి, సిరికి, దరిద్రానికి, వ్యాధికి, చావుకి మనిషి సర్వ స్థితిగతులకు కారణం తనే అన్నాడు. బంధాలు పెంచుకోవడం భ్రమలు పెంచుకోవడమే! బంధం శాశ్వతం కాదని తెలిసినప్పుడు కలిగేది కడివెడు దు ఖమే తప్ప పిడికెడు తృప్తి కాదు. అందుకే మనిషి బాంధవ్యబంధితుడు కాకూడదు. బంధం ఎంత గట్టిగా పెనవేసుకుంటే మనిషి అజ్ఞానమనే 'వూబి' లోనికి అంతగా దిగిపోతున్నాడన్నమాట. మనిషి దేనినయితే అమితంగా ప్రేమిస్తాడో అదే అతని దుఃఖానికి హేతువవుతుంది. ఈ సత్యాన్ని గ్రహించినవాడు తేజోమూర్తి అవుతాడు. ఈ లోకంలోని సర్వ సుఖాలను, కోరికలను తృణప్రాయంగా భావించి, ఆధ్యాత్మిక చింతనతో పరమపదం చేరుకుంటాడు. ప్రేమించిన వ్యక్తి కోసమో—వస్తువుకోసమో తపించి తపించి ఆ వలలో నించి బయటుపడలేక, అందులోనే అంతమవుతాడు. నరకానికి వెళ్తాడు...''

బాబూజీ ఆగారు. ఆయన మాట్లాడుతున్నంతసేపూ మంత్రించిన మనిషిలా వుండిపోయాను నేను. ఆ క్షణంలో బాబూజీ మూర్తీభవించిన వేదంలాగా, ఏ బలహీనతలకు లోనుగాని మనిషిలాగ అద్భుతంగా కనిపించారు. వారి ముఖం దేవుడి సన్నిధిలో వెలిగిన అఖండ జ్యోతిలా దివ్య ప్రభాయమానంగా వెలుగుతోంది.

''అయితే బాబూజీ, గర్భశోకం కలిగినందుకు విచారించడం తప్పంటారా?'' — అన్నాను సంశయాత్మకంగా.

''తప్పనడంలేదు నాయనా, కానీ, అది మనిషి బలహీనతను, అజ్ఞానాన్ని తెలియజేస్తుందంటున్నాను. వెలిగిన అగ్గిపుల్ల కాసేపటికి ఆరిపోతుంది. పుట్టిన ప్రతి మనిషి గిట్టక మానడు. ఆరిపోయే అగ్గిపుల్లను గురించి, మట్టికలిసే మనిషి గురించి మథన పడ్డం మనిషి అవివేకాన్నే తెలియజేస్తుంది. అందుకే ఆరిపోయే అగ్గిపుల్ల గురించి ఆవేదన చెందకుండా, ప్రతి మనిషి ఆత్మజ్యోతిని వెలిగించుకోవాలి'' —

నా మనసులో బాబూజీ విగ్రహం క్షణ క్షణానికి పెరిగిపోతోంది. భగవంతుడు ఈ సృష్టి రహస్యాన్ని యిటువంటి మహానుభావుల వల్లనే నాబోటి సామాన్యులకు అందిస్తాడని ఆరోజే అనుకున్నాను తొలిసారిగా. ఆరోజుకు అక్కణ్ణించి వచ్చేసాను. ఉద్యోగానికి రాజీనామా యిచ్చేసి, జీవిత శేషాన్ని యిక్కడే గడిపేద్దామన్న కోరిక ఎందుకో నాలో పెరుగుతోంది. అంతేకాదు. ఘోరమయిన హత్యలు, దొంగతనాలు చేసిన నేరస్థుల్ని జైళ్లకు పంపడం మానేసి ఇలాంటి ప్రశాంతవాటికలలో కొన్నాళ్లుంచితే వారి మనసులు శోధనమవుతాయి. నూటికి పది మందయినా పరివర్తన చెందుతారన్న నమ్మకంకూడా కలిగింది!

## పరమాత్మ రూపులు

కె. సీతమ్మ

చిన్న చిన్న పిల్లల
బోసి నోటి నవ్వులు
లేత లేత మనసుల
మంచి మంచి భావాలు
బుల్లి బుల్లి అడుగుల
అల్లి బిల్లి ఆటలు
చల్లనైన మనసుల
ఉత్సాహపు బాటలు
ముద్దు ముద్దు మాటల
వచ్చి రాని పలుకులు
పసిడి మనసు కందని
తీయనైన ఊహలు
శుద్ధమైన రూపులు
పరిశుద్ధ హృదయులు
పాపమలిన మంటని
పరమాత్మ రూపులు.

మర్నాడు తెల్లవారుఝాము నాలుగింటికే నిద్రలేపాడు రాంగోపాల్. గబగబ కాలకృత్యాలు తీర్చుకుని, సముద్ర స్నానంచేసి, తర్వాత పూజామందిరానికి వెళ్లాను. అక్కడ చాలామంది గుమిగూడి వున్నారు. సరిగ్గా అయిదుగంటలకి స్వామీజీ శిష్యులు ప్రార్థన గీతం ఆలపించారు. ముందు బాబూజీ ఆలాపన అందించారు. తర్వాత శిష్యులు అందుకున్నారు. కేవలం హార్మనీ తబలాలతో ఆ గీతం ఎంత కమ్మగా ఆలపించారు? తెలతెలవారుతున్న సమయంలో చలచల్లని గాలులు శుభ్రస్నాతులైన శరీరాలకు సోకి ఆహ్లాదాన్ని కలిగించడం ఓ వయిపు, వారు ఆలపిస్తున్న ప్రార్థనగీతంలోని భావం, రాగం, సంగీతం, మనసును పేరు తెలియని సుదూర తీరాల కావలనున్న ఆనంద శిఖరాల మీద పండబెట్టడం మరోవయిపు. మాటల కందని అనుభూతిని చవిచూసానా సమయంలో. పూజావిధానంలో నాకు వింతగా కన్పించింది, ఎవరి చేతుల్లోను నైవేద్యాలు లేకపోవడం! ఆ విషయం ఒకర్నడిగాను. ''నిండుమనసుతో చేతులు జోడించే ప్రతి మనిషి గుండె భగవంతునికి ప్రీతిపాత్రమయిన నైవేద్యమేనని బాబూజీ అంటారు'' — అన్నాడా వ్యక్తి.

ప్రతిక్షణం ఎదుగుతున్న బాబూజీ రూపం క్రమంగా నా మనసులో పట్టదేమోనన్న సంశయం కలిగింది నాకు. పూజానంతరం బాబూజీ రోగులను పరిశీలించే నిమిత్తం అటువయిపు వెళ్లారు. నేను నా గదిలోనికి వెళ్లిపోయి నిన్న బాబూజీ చెప్పిన మాటల్ని నెమరువేసుకుంటూ మధ్యాహ్నం వరకు ఉండిపోయి, మధ్యాహ్నం భోజనంచేసి, వారి గది దగ్గరకు వెళ్లాను. ఆరోజు వారు నాకు చెప్పిన అనేకమయిన వజ్రతుల్యమయిన బోధనలలో కొన్ని నా మనసులో హిమాలయా శ్రేణుల్లా స్థిరంగా నిలిచిపోయాయి.

''ఈ జగత్తునంతటిని జయించి, శాసించగల మానవుడు తనను తను జయించుకోలేక పోతున్నాడు. ఎందుచేత? మనిషి శక్తియుక్తులకన్నా, మేధకన్నా, అతని మనో దౌర్బల్యాల శక్తి హెచ్చుకావడమే అందుక్కారణం! మనిషి ఇంద్రియాలను జయించి

జితేంద్రియుడు కానక్కర్లేదుగాని మానసిక బలహీనతలను అదుపులో వుంచుకుని, భ్రమలకు లొంగిపోకుండా జీవించాలి.''

''అది తమబోటి మహాత్ములకు తప్ప మాబోటి చపలచిత్తులకు సాధ్యమవుతుందా బాబాజీ ?'' — నేను చాలా సిన్సియరుగా ప్రశ్నించాను.

''కృషితో నాస్తి దుర్భిక్షంనాయనా. సాధన వలన సాధించలేని దేమున్నది ? ఉక్కుమనసు, ఇనపనరాలు కలిగివున్న మానవుడు దేన్నయినా జయించగలడు. దేవునియందు భక్తి పెంచుకో, భ్రమలను తొలగించుకో. ఆత్మయోగి వవుతావు'' —

నా మనసులో మరుగుతున్న సంశయాన్ని బాబాజీకి చెప్పాను. ''బాబాజీ, నా మనసులోని కోరికా అదే ! ప్రశాంత వాతావరణంలో పరమాత్ముని ధ్యానించుకొని, మనసు దిటవు పరుచుకుందామనే యింత దూరం వచ్చాను కాని బాబాజీ, నేను కనులు మూసినా తెరచినా, ఆత్మహత్య చేసుకున్న నా కొడుకు జ్ఞాపకాలే నా వెంట తరుముతున్నాయి.''

నా మాటలకి బాబాజీ తన అనుభవాన్నంతటిని ఒక్క పెదవి విరుపులో యిమిడ్చి ఓ నవ్వు నవ్వారు మెత్తగా.

''అక్కడే వ్యక్తికి, ఆత్మశక్తికి పోరాటం జరుగుతుంది. స్థిరచిత్తం లేనివాడు దేనిమీద మనసును లగ్నం చేయలేడు. అణువు అణువునా ప్రశాంతత నింపుకున్న యీ ఆశ్రమంలో నీవు మనోనిశ్చలత పొందలేకుండా వున్నావంటే, తృటిలో తెగిపోయే బంధాల్ని గురించి యోచిస్తున్నావంటే నీలో యింకా అనుబంధాల ఆవేశం, మమతల తీపి అంతరించలేదన్నమాట. మనమందరం రైలు ప్రయాణం చేస్తున్నాం. నీ పక్కనున్న ప్రయాణికుడితో స్నేహం పెంచుకుంటావు. ఆ ప్రయాణికుడు తన స్టేషన్ రాగానే దిగిపోతాడు. అప్పుడు నీకు రవంత బాధ కలుగుతుంది. తర్వాత నీ స్టేషను వస్తుంది. అప్పుడు నువ్వూ దిగిపోతావు. ఈ లోకంలో మనమందరం అంతే ! ఎవరి సమయం వచ్చినప్పుడు వారు వెళ్లవల్సిందే ! కానీ, కాలమనే రైలుబండి మాత్రం నిరంతరం పయనిస్తూనే వుంటుంది. మనిషి శరీరం ఓ యిల్లనుకుంటే, జ్ఞానమనేది ఆ యింట్లో వెలిగే దీపమన్నమాట. దీపం లేని యింట్లో చీకటి ఆవరించినట్లు, జ్ఞానజ్యోతిని వెలిగించుకోని



''పదిపైసలు పువ్వులు కొనరు గాని మావారు పదహారు రూపాయల చీర కొంటారు''

''పూలకన్న చీర అవసరంకదా? మరీ !... అమ్మడూ...''

మనిషిలో అజ్ఞాన తిమిరం ఆవరించుకుని వుంటుంది. ఎన్నో అనర్థాలను కలగజేస్తుంది. చివరకి నీలో కడివెడు దుఃఖాన్ని చిమ్మి నీ బ్రతుకును నరకం చేస్తుంది.''

ఈ మాటలు నామీద ఎంతగా పని చేసాయో నేను చెప్పలేను. బాబాజీ బోధనలు వింటున్నకొద్దీ, ఫెళ ఫెళ మండే ఎండలో, జోడు లేకుండా నడుస్తున్న నేను, చల్లటి ఏటినీట్లో కాళ్ళు కడుక్కుని చెట్టు నీడన సేద దీర్చుకున్నట్టుగా ఎంతో హాయి ఫీలవసాగాను. బాబాజీ నాకు ఓ నెల రోజుల్లో ఎన్ని మహత్తర సత్యాలను బోధించారని ! జబ్బుతో బాధపడుతున్న నా మనసుకు కొత్త నెత్తురు వచ్చింది. కర్తవ్య విముఖుడనై వుద్యోగానికి రాజీనామా చేద్దామన్న నా తలపు తుపాకీ శబ్దానికి పిట్ట ఎగిరిపోయినట్టు ఎటో ఎగిరిపోయింది. నా మనసు తృప్తి పడుతున్న రోజుల్లోనే ఓ రోజు నాకు మా డిపార్టుమెంటునించి టెలిగ్రాం వచ్చింది. ఏదో కేసు విషయంలో 'విట్నెస్' చెయ్యడానికి రమ్మనమని దాని సారాంశం. బాబాజీ వద్ద అనుమతిపొంది బయలుదేరాను. పట్నంలో కేసు వ్యవహారాలు తెముల్చుకుని తిరిగి ఆశ్రమానికి వచ్చేసరికి తొమ్మిది రోజులయిపోయింది. నేను తిరిగివచ్చేసరికి ఎందుకో ఆశ్రమం దిగులుగా కనిపించింది. బాబాజీ గదిదగ్గరకు వెళ్లాను. వారు పడుకుని వున్నారుకాని నిద్రపోవడంలేదు. నా రాక గమనించి వారు లేచికూర్చున్నారు. వారి చేతిలో దినపత్రిక వుంది. వారి ముఖం మునుపట్లా అఖండజ్యోతిలా వెలగడంలేదు, చమురుయింకిపోయిన దీపంలా నిస్తేజంగా వుంది. ఈ తొమ్మిది రోజుల్లోనే వారు ఎంతో చిక్కిపోయినట్టు కనిపించారు. అయిదు నిమిషాల దారుణ నిశ్శబ్దం తర్వాత వారే అన్నారు. ''మీరు చాలా అన్యాయం చేస్తున్నారయ్యా'' అని.

నాకు అర్థంకాలేదు వారి మాటలు. నాలో రవంత భయం కలిగింది. ''నేనా బాబాజీ?''— అన్నాను ఆశ్చర్యంగా. ''మీరంటే నువ్వు కాదులే, మీ పోలీసులు, అమాయకులను అన్యాయంగా పొట్టనపెట్టుకుంటున్నారు.''— అన్నారాయన. వారి మాటల్లో చిటికెడు కోపం, బాధ కన్పించాయి నాకు.

పోలీసులు అప్పుడప్పుడు అమాయకుల్ని హింసించడంలేదని నేనలేనుగాని, బాబాజీ యిప్పుడు చెప్తున్నది దేన్నిగురించో తెలియక గాబరాపడ్డాను.

''తమరు చెప్తున్నది...'' — నా మాటకి సమాధానంగా వారి చేతుల్లోని దినపత్రికను నాకు యిచ్చారు. అందులో మొదటి పేజీలోనే మురళీకృష్ణ, అనే స్టూడెంట్సు యూనియన్ లీడరు ఫోటో వుంది. అతని ఫోటోక్రింద అతని మరణ విశేషాలు రాసి వున్నాయి. మురళీకృష్ణ నాకేం కొత్తగాదు. మా డిపార్టుమెంటులో అతనిమీద కొన్ని రౌడీషీట్సు వున్నాయి. ఊళ్లో జరిగే ఎన్నో అల్లర్లకి అతని బాధ్యత చాలావుంది. ఏమయినా పోలీసు డిపార్టుమెంటుకి ఎన్నో పర్యాయాలు సమస్యగా నిల్చిన యువకుడు ... కొన్ని రోజులక్రితం పట్నంలో చెలరేగిన ఆందోళనలో క్రాంతికారుడుగా తయారై చాలా అల్లర్లు చేసాడు. పోలీసులను రాళ్లతో కొట్టాడు, కొట్టించాడు. చివరికోరోజ పోలీసులు జరిపిన కాల్పుల్లో మరణించాడు ఆ కేసు సందర్భంగానే నేనిప్పుడు పట్నం వెళ్లివచ్చింది. శవాన్ని తీసుకువెళ్లడానికి అతని తలిదండ్రులుగాని, దగ్గర బంధువులుగాని రాకపోవడంవలన స్థానికంగా వున్న ఒక సేవ సమాజంవారు, కళాశాల విద్యార్థుల సాయంతో దహనక్రియలు జరిపించారు .. అయితే ఆ మరణానికి, బాబాజీ విషాదానికి గల సంబంధం ఏమిటో నాకు అర్థమవలేదు.

''బాబాజీ తమరి ఆంతర్యం ఏవిట అర్థంచేసుకోలేకపోతున్నాను. ఆ కుర్రవా

పేరు మురళీకృష్ణ. యితను కాలేజీలో చదువుతూ...'' — నా మాటలు పూర్తవకుండానే బాబూజీ కొంచెం చిరాకుతో అన్నారు. ''నా బిడ్డ గురించి నువ్వు వివరాలు చెప్తావేమిటి?''

నా వెన్నుమీద 'చెర్నాకోలా'తో చరిచి నట్టయింది. నా ఆశ్చర్యానికి అవధులులేవు. మురళీకృష్ణ మీ బిడ్డడా? హిమాలయం పదువున కార్చిచ్చు పుడుతుందా? ''నిజమా ?'' అన్నాను మెల్లిగా.

''అవును బాబూ! మురళీ చాలా ఉపాయపరుడు. హాస్టల్లో వుంటూ, కాలేజీలో చదువుకుంటున్నాడు. ఎవరో అల్లరి మూకలను కాల్చబోయి మీ పోలీసులు ఉన్మాదంగా సింగంలాంటి మురళిని కాల్చి చంపేసారు. ఎందుకింత అన్యాయం జరుగుతోంది ? ఎందుకు వీరిలా నిరంకుశంగా ప్రవర్తిస్తున్నారు ?'' — ఆయన గొంతు బొంగురుపోయింది. ఆయన ముఖం వర్షించడానికి సిద్ధంగావున్న మేఘంలా తయారయింది. నానోటంట మాటరాలేదు. తన కుమారునిమీద ఎంత తీయటి అభిప్రాయంలో వున్నారు ! తండ్రిగా అది సహజమేమోగాని, కొడుకు మరణంతో ఆయన ఎంత చలించిపోయారు ? కాలం విసిరే సుడిగాలికి చెట్లు చేమలు కదలొచ్చునుగాని, పర్వతాలు కదులుతాయా ? మురళీకృష్ణ గురించి బాబూజీ తీయటి అబద్ధంలో మునిగివున్నారు. కాని, చేదుగావున్నా నిజం చెప్పక తప్పదు. మెల్లి మెల్లిగా, భయం భయంగా చెప్పాను వివరాలన్నీ. అంతా విన్నాక వారి ముఖం అగ్గిలో కాలిన ఇనపచట్రంలా ఎర్రగా మారింది. కానీ, వారేమీ మాట్లాడలేదు. మురళీకృష్ణ బాబూజీ కొడుకని తెలిసినప్పటికంటే, అతను దిక్కులేని చావుచచ్చి, ఎవరిచేతో దహనం చేయబడ్డాడే అన్న ఆలోచన నా మనసుమీద 'ఏసిడ్' పోసినట్టు భగభగ మండించింది. అయిదు, పది, పదిహేను నిమిషాలు గడిచినా బాబూజీ తమ గంభీర ముద్రనించి బయల్పడలేదు తర్వాత మెల్లిగా నా గదికి వచ్చేసాను. గది దగ్గర రాంగోపాల్ నిలబడివున్నాడు అతనొక్కడే బాబూజీకి ఆంతరంగికుడు, ఆయన గురించి అన్నివిషయాలు తెలిసినవాడూను. రాంగోపాల్‌ని అడిగాను బాబూజీ మనసులోని విషాదం గురించి. మొదట రాంగోపాల్ కొంచెం

---

# యువతరం

జై ఆంధ్ర ఉద్యమం ఉప్పెన లాంటిదైతే ఆకల్లోల సాగరంలో ఉవ్వెత్తున లేచిన కెరటాలెన్ని ? అంటే ఎవరు లెక్కట్టగలరు... అటువంటి కెరటం పందొమ్మిది సంవత్సరాల సిహెచ్. కమలాకరరావు. విజయవాడ కాలేజీలో బి కామ్ విద్యార్థి... లోగడ ఒకసారి ఇంగ్లీషు మీడియమ్ కావాలంటూ లేచిన ఉద్యమంలో ప్రముఖ పాత్ర వహించినవాడు – యిప్పటికీ ఆంధ్ర రాష్ట్రం తెలంగాణా రాష్ట్రం అనేవి వస్తాయన్న నమ్మకం వున్నవాడు.

చాలాసన్నంగావున్నా చాలా ధైర్యంగా ఉద్యమంలో ఎక్కడ పికెటింగ్,ఎక్కడ హర్తాళ్, ఏచోట 'బంద్' లాంటి అలజడి వున్నా వాటికి ఊపిరిపోసిన యువకిశోరాలలో ఒకడుగా కనపడ్డ యీ కుర్రాడికి రాజకీయాలలోనే పెరిగిపోవాలన్నకాంక్ష బాగా వుందని చెప్పాడు.

క్రికెట్ ఆడతాడు. వాలీబాల్ ఆడతాడు. వాడేకర్ అంటే ప్రేమ... పైనాసరే కాలేజీలో ప్రముఖంగా నలుగురిలో గుర్తింపబడేవానిగా వుండాలన్న తహతహగల బావి పౌరుడు. కమలాకర్‌కి ''చెడ్డ అలవాట్లు లేవుట''—అంటే స్మోకింగ్, డ్రింకింగ్ వగైరా లేవు అని చెప్పాడు.

లాఠీ దెబ్బల్లో 'జై ఆంధ్రా' అన్న అరుపుతో తలపై తగిలిన ఎర్రని గాయాన్నిమరిచిపోయినయీవిద్యార్థికి బెల్ బాటమ్స్, హిప్పీ చొక్కాలు గట్రా యిష్టంలేవు—పైగా వాళ్ళ క్లాసులో ''యాంటీ హిప్పీయాంటీ బెల్‌బాటమ్స్'' సంఘాన్ని పెట్టిన యీ కమలాకర్‌కి కూడా 'జయా బాధురీ బచ్చన్' అంటే మహా యిష్టం.

ఇంగ్లీషు మీడియమ్ కావాలంటాడు కాని హిందీ బయస్కోప్‌లంటే మొదటి ప్రేక్షకుడిగా వుంటాడు... ప్రేమించాలని ఆ తర్వాత పెళ్ళి చేసుకోవాలని వుంది.

చిన్న కథలు చదవడు. నవలలే అన్నీ చదువుతాడు. పత్రికల్లో విజ్ఞానం విశేషాలు అవిమొదట చూస్తాడు.



లాల్‌బహదూర్‌శాస్త్రి గారంటే గౌరవం ... కోడూరి కౌసల్యాదేవి,యద్దనపూడి సులోచనారాణి ఎవరంంటే పూర్తిగా చదువుతాడు...మిగతా విషయాలు... మళ్ళీ రాష్ట్రం కోసం ఉద్యమంవస్తే మాత్రం ''వదలడు''—''వేర్పాటువాదిగా''నే రాజకీయాల్లో దిగాను కనుక అధికారపార్టీ అంటే యిష్టంలేదు అన్నాడు

'ఈత' బాగా వచ్చును. కృష్ణకి రోజూవెళ్ళి ఈతకొట్టి వస్తేతప్ప తోచదు ... ఉపన్యాసాలు చేయటం కూడా అలవాటైపోయింది ఉద్యమం కారణంగా. మంత్రి అవ్వాలనుందట ! పెద్దాడైనాక : బెటర్ !

[వీరాజీ]

సంశయించినా తర్వాత స్వల్పకాలంలోనే మామధ్య నెలకొన్న మైత్రిని పురస్కరించుకుని బాబూజీ గురించి చెప్పాడు. పేపర్లో, మురళీకృష్ణ మరణవార్త చదివిందగ్గర్నించి బాబూజీ అన్యమనస్కంగా వుంటున్నారట. ప్రార్థనల్లో ఏకాగ్రత తగ్గిందట. ఆశ్రమవాసులతో సంభాషించడంకూడా తగ్గించేసారట ... ఇవీ ఆయన చెప్పిన వివరాలు.

నాకా రాత్రి నిద్రపట్టలేదు. మనసులోని ఆలోచనలు మెదడుని వేడెక్కించాయి. సముద్రపు ఒడ్డుకెళ్లి కూర్చొని ఆలోచించాను. ఎంతటి ఇనుమయినా అగ్గి వేడికి మెత్తబడినట్లు ఎంతటివారయినా కడుపుతీపికి లొంగిపోవాల్సిందేనా? భవ బంధాలు అశాశ్వతమని, అజ్ఞానమని ఎంతో గట్టిగా చెప్పిన బాబూజీ బాంధవ్య బంధితులు అవుతారా? నేనూ, ఆయనా ఒకటేనా? కాదుకాదు. విజ్ఞాన మేరువు ఆయన, అజ్ఞాన శిలను నేను. అనంత విజ్ఞానసాగరం బాబూజీ, చిన్న నీటి పాయను నేను. వారికి నాకు సామ్యమా? బాబూజీ మనోవైకల్యం గురించి ఇదమిద్ధమైన నిర్ణయానికి రాలేకపోయాను.

తర్వాత మరో అయిదురోజులు గడిపాను అక్కడే. తర్వాత నేను బయలుదేరవలసిన రోజు వచ్చింది. నిజానికి అయిదురోజుల్లోను వారిని దర్శించింది రెండుసార్లే. ఈ రెండుసార్లు ఆయన ముఖం ప్రసన్నంగా వుంది. నవ్వుతూనే పలకరించారు. నా మనసు తృప్తిపడింది. వారిని గురించి భిన్నంగా ఆలోచించినందుకు నా వ్యక్తిత్వం సిగ్గుపడింది. నేను బయలుదేరి వెళ్లేముందు వారినోమారు దర్శించి ఆశీర్వాదాలు పొందాలని వెళ్లాను. వారు నిండుమనసుతో దీవించారు. "బోధనలు చేసినందుకుకాదు, బోధనలవల్ల ఒక వ్యక్తి ప్రభావితుడై, కర్తవ్య నిర్వహణకు ఉత్సాహంగా ముందడుగు వేస్తున్నందుకు గర్వంగా వుంది, సంతోషంగా వుంది." అన్నారాయన. "తమరు చెప్పిన ప్రతి మాట నా గుండెల్లో జేగంటలా మ్రోగుతోంది బాబూజీ, తమరి మాటలు మరవలేను" — అంటూ నమస్కరించాను. "చెప్పిన మాటలు మరవకపోవడం కృతజ్ఞతకు నిదర్శనం. చెప్పిన మాటలు ఆచరణలో పెట్టడం ఉత్తముని లక్షణం. నీ కర్తవ్య నిర్వహణలో మంచికి మేలుచెయ్యి. చెడ్డనుకూడా మంచిగామార్చే ప్రయత్నంచెయ్యి. జీవన పోరాటంలో తప్పకుండా విజేతవవుతావు." అంటూ ఆయన నిండుమనసుతో ఆశీర్వదించారు. నా కళ్లు చెమర్చాయి. బాబూజీ ముఖం మునుపటికంటే ప్రకాశవంతంగా కనిపించింది. ఆశ్రమం విడిచిపెట్టడానికి మనసు అంగీకరించకపోయినా బండి ఎక్కక తప్పిందికాదు.

*　　　*　　　*

ఆ తర్వాత నాకు గుంటూరు ట్రాన్స్ఫరై పోయింది. రెండు సంవత్సరాలకాలం రెండు రోజుల్లా గడిచిపోయాయి. ఓ ముఖ్యమయిన పనిమీద మళ్లీ ఆ వూరు రావల్సివచ్చింది. ఈ రెండేళ్లలోను బాబూజీని చూసే అవకాశం కలగలేదు నాకు. వచ్చిన మర్నాడే కరుణాశ్రమానికి వెళ్లాను. ఆశ్రమం దీపం ఆరిపోయిన పూజామందిరంలా కన్పించింది. మనసు కీడుశంకలాడింది. బాబూజీ మందిరం దగ్గరకి వెళ్లాను. గుమ్మందగ్గర రాంగోపాల్ కూర్చున్నాడు. అతను మునుపటికంటె చిక్కిపోయివున్నాడు. గెడ్డం మాత్రం బాగా పెరిగివుంది. నన్ను చూసిన వెంటనే గుర్తుపట్టలేకపోయాడు. కాని, ఓ అరనిమిషం తదేకంగా చూసి గుర్తుపట్టి చేయి కలిపాడు. కుశలప్రశ్నల తర్వాత "బాబూజీ బావున్నారా? ఎక్కడున్నారు?" అన్నాను. దానికాతను జీవరహితమయిన నవ్వు నవ్వి "బాబూజీ... యింకెక్కడ బాబూజీ, మీరు వెళ్లిపోయిన ఆరేడు నెలలకే కాలంచేసేసారు" అన్నాడు. నా ముఖంమీద చెళ్లుమని చరిచినట్టయింది. ఎవరో ఆత్మీయుణ్ణి కోల్పోయినట్టుగా బాధపడ్డాను. "ఏదయినా జబ్బుచేసి పోయారా?" అన్నాను. "జబ్బా? బాబూజీది ఉక్కు శరీరం. ఆయనకి జబ్బేమిటి?" అన్నాడు రాంగోపాల్. "మరయితే ఎలా పోయారు?" ఆసక్తిగా అడిగాను. తర్వాత మరి రెండు మూడు ప్రశ్నలడిగాను. వాటన్నిటికి కలిపి అతను చెప్పిన సమాధానం నాకు చాలా వింతగా తోచింది. అతను చెప్పిందిది.

"మనోవ్యాధికి మందు లేదంటారు తెల్సు కదా! బాబూజీకి ఆ వ్యాధే సోకింది. దానికి మందు అటు తనకి తెల్సిన ప్రకృతి వైద్యంలో గాని, యిటు తను సంపాదించుకున్న విజ్ఞానంలోగాని పొందలేకపోయారు. మురళీకృష్ణ మరణం బాబూజీ మనసుమీద గొప్ప దెబ్బ తీసింది. ఆ దెబ్బ దెబ్బ చావుదెబ్బే అయింది. బాబూజీ మనసు ఈ ప్రపంచంలో ఎవర్నయినా ప్రేమించిందీ అంటే అదొక్క మురళీననే చెప్పాలి! అయితే ఆ సంగతి మురళీ మరణం తర్వాతగాని వారికి తెలిసిరాలేదు. తెలిసింతర్వాత వారు మానసికంగా పడిన బాధ అంతాయింతాకాదు. తనకి ప్రియమైన మురళీ దారుణంగా మరణించి, తనగుండెల్లో మంటలు రేపాడేనన్న బాధ ఒకవయిపు, బాంధవ్య బంధితులు కావడం మనిషి మానసిక దౌర్బల్యానికి, అజ్ఞానానికి నిదర్శనమని తను ఎంతోమందికి చెప్పి, చివరికి తనుకూడా అందులో బంధీ అయిపోయి పరితపిస్తున్నానే అన్న బాధ మరోవయిపు వారిని చిత్రహింసలు పెట్టింది. చివరికి ఆ బాధే వ్యాధిగా మారి, వారిని అంతం చేసింది."— రాంగోపాల్ కళ్ళు చెమర్చాయి.

నాకో సందేహం వచ్చి అడిగాను. "బాబూజీకి మురళీకృష్ణ ఒక్కడేనా సంతానం?" — అని.

సంతానమా? బాబూజీ వివాహితులు కారు. ఆజన్మ బ్రహ్మచారులు. మురళీ వారి సొంతబిడ్డ కాదు. పెంపుడుబిడ్డ. నేనీ ఆశ్రమానికి వచ్చిన తొలి రోజుల్లో ఓ రోజు ఎవరో నెలయినా నిండని పసిగుడ్డును ఆశ్రమంబయట వదలిపోయారు. బాబూజీయే ఆ బిడ్డను సాకి పెద్దచేశారు. ఆ కుర్రవాడే మురళీకృష్ణ! సొంత కొడుకయితేనేం, పెంపుడు కొడుకయితేనేం, బాబూజీ గుండెల్లో తొలిప్రేమ జ్యోతి వెలిగించింది ఆ జీవుడే! అయితే ఆ విషయం ఆ జీవుడు పోయింతర్వాతగాని బాబూజీ తెల్సుకోలేకపోయారు. తెల్సింతర్వాత, యిందాక చెప్పాను గదూ, బాంధవ్య బంధాలకు తనే చిక్కిపోయానని, తనూ పరాజితుణ్ణయిపోయానే అన్న దిగులుతోనే తనువు చాలించారు. ఈ దిగులే లేకపోతే బాబూజీ ఆరోగ్యానికి మరోనలభై ఏళ్లవరకు ఏ ఢోకా లేదు."



కొన్నిసుఖాలు కష్టాలు కలిసికట్టుగా వస్తుంటాయి మన జీవితంలో...

ఏంజరిగింది మాష్టారూ!

ఆర్రూపాయల సుత్తి అరవైపైసలకి కొనేశాను మేకు కొడుతుంటే వేలు చితికి ఐదురూపాయల ఇంజక్షన్ తీసుకున్నాను.



''కోడెనాగు''లో లక్ష్మి

# దర్శకుడు వేసుకొన్నపథకం!

కథకుడిగా, సంభాషణలకర్తగా, సినిమా అనువాదకునిగా, దర్శకునిగా దాసరి నారాయణ రావు తన ప్రతిభని ''తాత – మనవడు'' చిత్రంలో ప్రదర్శించారు. ఒక్క చిత్రంతోనే ఇంత పేరును ఆర్జించిన దర్శకుడు దాసరి ఒక్కరేనేమో అనిపిస్తుంది. ఆ చిత్రం రజతోత్సవం జరుపుకుంది.

శ్రీ నారాయణరావు దర్శకత్వం నెరపిన రెండవ చిత్రం ''సంసారం–సాగరం'' మొదటిది తెచ్చిన పేరును పెంచుతుంది అంటున్నారు సినిమాను చూచిన విమర్శకులు.

ఇటీవల ఆయన్ను ''రాధమ్మ పెళ్లి'' సెట్లో కలిశాను. 'మీ భవిష్యత్కార్యక్రమం ఏమిటి ?' అని ప్రశ్నించాను.

''నేను ఒక చార్టు వేసుకొన్నాను. సాధ్యమైనంతవరకు దాని ప్రకారం నా కార్యక్రమాన్ని రూపొందించుకొంటాను'' అంటూ ఆయన కొన్ని విషయాలను చెప్పారు.

''నేను ఎక్కువ చిత్రాలను అంగీకరించను. సంవత్సరానికి మూడు మాత్రమే చెయ్యదలిచాను. ఆ మూడింటికి కూడా ఒక పద్ధతిని ఆలోచించాను. ఈ స్కీము 1975 జనవరి నుండి అమలులోకి వస్తుంది,'' అన్నారు దాసరి.

**చిత్రాల చార్టు !**

''జనవరి నెలంతా స్క్రిప్టు వ్రాసుకొంటాను. ఫిబ్రవరి, మార్చిలో షూటింగు పూర్తిచేస్తాను. ఏప్రిల్‌లో రీ–రికార్డింగు పెట్టుకొంటాను.

మేలో మరొక కథపై చర్చ, జూన్, జూలైలో షూటింగు, ఆగస్టులో రీ–రికార్డింగు పూర్తిచేస్తాను. తరువాత చిత్రానికి కథను సెప్టెంబరులో వ్రాసుకుని, అక్టోబరు – నవంబరులో షూటింగు పూర్తిచేసి, డిశంబరులో రీ–రికార్డింగును కంప్లీట్ చేస్తాను.'' అని చెప్పారు నారాయణరావు.

**మహానుభావులు !**

''శ్రీయుతులు పుట్టన్న, బాలచందర్, సేతు మాధవన్‌గార్లు తీసిన చిత్రాలజోలికి పోను'' అన్నారు దాసరి. ''ఏం, ఎందుకని?'' అడిగాను.

''వాళ్లు మహానుభావులు. వాళ్ల స్థాయిని చేరుకోగలనా అన్న సందేహం నాకు వున్నది. వాళ్లముందు నే నెంత ?'' అని ఎదురు ప్రశ్న వేశారు నారాయణరావు.

''ప్రస్తుతం రాధమ్మ పెళ్లి, బంట్రోతు భార్య చిత్రాలు చివరిదశ నందుకొన్నాయి. ప్రసాద్ ఇంటర్నేషనల్ కొకటి, ప్రతాప్ ఆర్ట్ ప్రొడక్షన్స్ కొకటి, రవిశంకర్ ఆర్ట్ పిక్చర్స్ కొకటి, గీతా ఆర్ట్ పిక్చర్స్‌కి ఒకటి చెయ్యడానికి నేను అంగీకరించాను'' అన్నారు 'తాత–మనవడు' ఫేమ్ దాసరి.

## ''బాబు''గా శోభన్‌బాబు

మైనరుబాబుగా మైనర్ల హృదయాలను దోచుకున్న డాక్టరుబాబుచేత 'బాబు' పాత్రను పోషింపచేస్తున్నారు, మారుతీ ప్రొడక్షన్స్ నిర్మాతలు ఏ. యల్. కుమార్, శివాజీగార్లు.

'బాబు' కథను బాక్సాఫీస్ దర్శకుడు కె. ఎస్. ప్రకాశరావు వ్రాశారు. మాటలను, పాటలను ఆచార్య ఆత్రేయ వ్రాస్తున్నారు. చక్రవర్తికి సంగీతాన్ని, మోహన్‌కు కళను, బి. జి. కి కూర్పును, విన్సెంట్‌కు ఛాయాగ్రహణాన్ని అప్పగించారు నిర్మాతలు. ప్రముఖ వ్యాపారవేత్త సీజర్ సమర్పించే ఈ చిత్రాన్ని ఒక ప్రతిభావంతుడు డైరెక్టు చేస్తున్నారు.

ఆయన పేరు రాఘవేంద్రరావు. దర్శకత్వ శాఖలో ఎంతో ప్రావీణ్యతవున్న మనిషి. చాలా హిట్ చిత్రాలకు అజ్ఞాత దర్శకుడిగా పని చేసిన ధీమంతుడు.

హీరోగా శోభన్‌బాబు నటిస్తున్న 'బాబు' చిత్రంలో వాణిశ్రీ, లక్ష్మి, నిర్మల, రమాప్రభ, ఎస్వీరంగారావు, రాజబాబు, సత్యనారాయణ, అల్లురామలింగయ్య ముఖ్య పాత్రధారులు. ఇది ఈస్ట్‌మన్ కలర్ చిత్రం.

## ఏటా రెండు ద్విపాత్రాభినయాలు !

హీరో శోభన్‌బాబును యిటీవల ఆయన యింటిదగ్గర కలిశాను. అప్పుడు ఏ.వి.ఎమ్. నిర్మాతలు ఆయన యింట కనిపించారు. వాళ్లు వెళ్లిన తరువాత నేను కాసేపు శోభన్ యింట వున్నాను. నేను గడిపిన అరగంటలో డజనుమందయిన వచ్చివుంటారు, ఆయనతో సినిమా తీయాలన్న తలంపుతో. కానీ,



ఆయన ఎవరికీ 'ఎస్' అనలేదు. 'అవును' అనకపోవడానికి ఆయన చెప్పిన కారణాలు సమంజసంగా వున్నట్టు అనిపించాయి. ఎక్కువ అంగీకరించి, కొన్ని విజయవంతం గావడంకన్నా, కొన్ని మాత్రమే అంగీకరించి, అన్నీ విజయవంతంగావడం మంచిదికాదని ఎవరయినా అనగలరా ?

సంవత్సరానికి ఎనిమిదిచిత్రాలు మాత్రమే ఆయన పనిచేస్తారట. రెండు ద్విపాత్రాభినయం చెయ్యడం తథ్యమట.

ఇంతవరకు శోభన్‌బాబు ద్విపాత్రాభినయం చేసిన చిత్రాలన్నీ హిట్ అయి వున్నాయి.

### ఎ. వి. ఎమ్ లో ద్విపాత్రాభినయం

ఏ. వి. ఎమ్. ప్రొడక్షన్స్ ఈస్ట్‌మన్ కలర్‌లో నిర్మించబోయే చిత్రంలో శోభన్ ద్విపాత్రాభినయం చేస్తున్నారు. ఈ చిత్రాన్ని మెయ్యప్ప చెట్టియార్ కుమారద్వయం కుమరన్, మురుగన్ డైరెక్ట్ చేస్తారట. తమిళంలో శివాజీ నటించిన హిట్ చిత్రానికి ప్రతిరూపమే శోభన్ అంగీకరించిన చిత్రం.

## హిట్ జంట నటించిన "మంచివాడు"

ఆంధ్ర ప్రేక్షకులకు యిష్టమైన జంటలు కొన్ని వున్నాయి. అలాంటి జంటలలో అక్కినేని, వాణిశ్రీ మొదటిది. వాళ్లిద్దరూ నటించిన ప్రతి చిత్రం ఆర్థిక విజయాన్ని తెచ్చిపెట్టింది. (ఆత్మీయులు నుండి కొడుకు—కోడలు వరకు).

ఆ తరువాత విడుదలైన చిత్రాలు ఎంతబాగున్నా, పెద్ద హిట్ గాలేక పోయాయి.

[illegible]

చాలాకాలం తరువాత వీనస్ కంబైన్స్ వారి "మంచివాడు" చిత్రంలో నాగేశ్వరరావు, వాణిశ్రీ జంటగా నటించారు. వీళ్లిద్దరూ కలిసి నటించిన చిత్రం ఎప్పుడొస్తుందా అని వువ్విళ్లూరుతున్న ప్రేక్షకులకు 'మంచివాడు' మంచి ఉత్సాహాన్ని యిస్తుందనడంలో సందేహంలేదు.

### ఇద్దరు "మ" లు

"మంచివాడు" చిత్రంలో యిద్దరు 'మ'లు తమ ప్రతిభను ప్రదర్శించారు. దర్శకత్వంలో మధుసూదన రావు, సంగీతంలో మహదేవన్ ఎంతకృషిసలిపారో నేనువ్రాయడం ఏల ? ఈ చిత్రానికి ఆచార్య ఆత్రేయ మాటలను, సెల్వరాజ్ ఛాయను,కృష్ణారావు కళను నిర్వహించారు. ముఖ్య పాత్రలను కాంచన, రాజబాబు, పద్మనాభం, సత్యనారాయణ, మాడా, జి. వరలక్ష్మి, రమాప్రభ, హలం పోషించారు. నవయుగ విడుదల చేసే ఈ రంగుల చిత్రాన్ని టి. గోవిందరాజన్ నిర్మించారు.

## అన్నపూర్ణా పిక్చర్స్

ఈ సంస్థ ఈస్ట్‌మన్ కలర్‌లో నిర్మిస్తున్న చిత్రం నాలగవ షెడ్యూలు హైద్రాబాదు సారథీ స్టుడియోలో పూర్తిగావడంతో, ఎనిమిది రీళ్లు వచ్చింది. ఈ షెడ్యూలులో



“స్త్రీ గౌరవం”లో రాజశ్రీ, నిర్మల, దేవిక, కృష్ణంరాజు

దాశరథి వ్రాసి, సుశీల పాడిన 'బర్త్‌డే సాంగ్' చిత్రీకరించబడింది. ఈ చిత్రానికి రాజేశ్వర రావు సంగీతసారధి.

అన్నపూర్ణా పిక్చర్స్ అధినేత దుక్కిపాటి మధుసూదనరావు బహుముఖ ప్రజ్ఞావంతుడు గావడంవల్ల ఆ సంస్థకు ఆదుర్తిలాంటి ప్రతిభావంతుడు దర్శకుడు గావడంవల్ల, అన్నీ హిట్ చిత్రాలే వచ్చాయి. ఇప్పుడు నిర్మాణంలో వున్న చిత్రంకూడా వుత్తమ కథను గొనియుండడంవల్ల, గ్యారంటీగా హిట్ అయి తీరుతుంది.

ప్రసిద్ధ నవలా రచయిత్రి యద్దనపూడి సులోచనారాణి విరచితమైన అముద్రితమైన కథ యిది. ఈ కథకు జాన్సన్ మాటలను రచించారు. సెల్వరాజ్ ఛాయను, జి. వి. సుబ్బారావు కళను, గురుదేవ్ సహకార దర్శకత్వాన్ని నిర్వహిస్తున్నారు.

**వహీదా ఆఖరి చిత్రం!**

ప్రముఖ హిందీ నటి వహీదా నటించే ఆఖరి చిత్రం యిదే అవుతుందేమో. ఈ చిత్రంలో నాగేశ్వరరావు, లక్ష్మి దంపతులుగా నటిస్తున్నారు. ముఖ్య భూమికలను రంగారావు, కాంతారావు, సత్యనారాయణ, రాజబాబు, సూర్యకాంతం, గిరిబాబు, మమత ధరిస్తున్నారు. నవయుగ రిలీజ్.

# సినిమా

## ఎన్టీఆర్ కొత్త చిత్రాలు!

నాకు తెలిసినంతవరకు 'నటరత్న' రామారావు యిరవైమంది నిర్మాతలకు 'నో' అని చెప్పారు. ఇప్పటికీ అయన ఇంట రోజూ కొన్ని వందలమంది యాత్రికులు వచ్చి, ఆయన ఆశీస్సులు అందుకొంటున్నారు. ప్రస్తుతం ఆయన అంగీకరించిన చిత్రాలను పాఠకులకు తెలియచేస్తాను.

**"తాతమ్మకల"**

రామకృష్ణా సినీ స్టుడియోస్ నిర్మిస్తున్న చిత్రం. కథ, సినిమా అనువాదం, దర్శకత్వంను రామారావు చేపట్టారు. మాటలను డి. వి. నరసరాజు వ్రాశారు. ఇటీవల యీ చిత్రం షూటింగు నిమ్మకూరులో జరిగింది. ఈ చిత్రంలో నటరత్న, భానుమతి, కాంచన, శుభ, రోజారమణి, రాజబాబు, హరికృష్ణ, బాలకృష్ణ ముఖ్యపాత్రధారులు.

**తారకరామ పిక్చర్స్!**

ఈ సంస్థ తలపెట్టిన చిత్రంలో రామారావు చేపట్టిన పాత్ర వెరైటీ వున్నది. ఈ చిత్రాన్ని కె. డి. వి. ప్రసాద్ నిర్మిస్తున్నారు. మాటలను జాన్సన్, సంగీతాన్ని మహదేవన్, ఛాయను సత్యనారాయణ, కళను కృష్ణారావు నిర్వహిస్తున్నారు. దర్శకత్వం అంటారా! ఎన్నో విజయవంతమైన చిత్రాలను సృష్టించిన యోగానంద్ స్వీకరించారు. ఈ చిత్రంలో వాణిశ్రీ, విజయలలిత, రమాప్రభ, సత్యనారాయణ, రాజబాబు ముఖ్యపాత్రలను పోషిస్తున్నారు.

**"దీక్ష"**

పద్మజా మూవీస్ నిర్మించే చిత్రం "దీక్ష"ను దక్షతగల ప్రత్యగాత్మ డైరెక్టు చెయ్యడం ఒక విశేషం. రామారావు చిత్రాన్ని ఆయన చేపట్టడం ఒక విశేషం. ఈ చిత్రానికి ప్రత్యగాత్మ మాటలు వ్రాయడం మరొక విశేషం. మనసు – మాంగల్యం నిర్మాత కుటుంబరావు రామారావుతో ఈ చిత్రాన్ని తలపెట్టడం మరొక విశేషం. ఈ చిత్రంలో జమున, అంజలీదేవి, పండరీబాయి, శుభ, రాజబాబు, ప్రభాకరరెడ్డి ముఖ్యపాత్రధారులు. సంగీత దర్శకుడు పెండ్యాల ప్రతి పాటను హిట్ చెయ్యడానికి ప్రతినబూనడం మరొక విశేషం. ఛాయను జి. కె రాముకు, కళను కళాధర్‌కు, కూర్పును శ్రీహరిరావుకు అప్పగించారు, నిర్మాత.

"స్వయంకృషితో, దీక్షా దక్షతలతో సామాన్య మానవుడు అసాధారణ విజయాన్ని, అఖండ సన్మానాన్ని పొందగలడు" అన్నదానిని

చాటిచెప్పే యీ కథను ఆర్. కె. ధర్మరాజు వ్రాశారు.

## మాధవ చిత్ర

సారాయి తాగితే... స్వర్గలోకం, కల్లు తాగినోడికే కైలాసం. చెబుతాను వినుకోరా పింగినాథం. రాసుకుంటూ చెప్పరా రామ నాథం'' అనెడి పాటను జానపదగేయరాజు కొసరాజు మాధవ చిత్రవారి పేరుపెట్టని చిత్రంకోసం వ్రాశారు ఏ పాటనైనా సునా యాసంగా పాడనేర్చుకొన్న బాలు యీ పాటను ఎంతో నేర్పుతో పాడారు. ఈ పాటను రాజబాబుపైన చిత్రీకరించారు, దర్శకుడు ఆర్. శ్రీనివాసరావు.

మాధవ చిత్ర నిర్మిస్తున్న యీ సాంఘి కంలో కృష్ణ, విజయనిర్మల, రంగారావు, రేలంగి, శ్రీధర్, రాధాకుమారి, ఛాయాదేవి ముఖ్య పాత్రలను పోషిస్తున్నారు. ఇప్పటికి అయిదు రీళ్ల చిత్రం పూర్తయింది. ఈ చిత్రానికి బొల్లిముంత మాటలను, గోపాల కృష్ణ ఛాయను, సూరన్న శిల్పాన్ని, ఎం.ఎస్. మణి కూర్పును నిర్వహిస్తున్నారు.

''విధిబలీయం. మనం నిమిత్తమాత్రులం. విధి ఆడించే వింత నాటకంలో మనమంతా పాత్రధారులం.'' అన్న అంశానికి ప్రాముఖ్యం వున్న కథ యిది అన్నారు మాధవ చిత్ర అధినేత జి. వెంకటరత్నం.

## దాశరధి 'జోలపాట'

రామవిజేతా ఫిలింస్‌వారి ''తులసి'' చిత్రా నికిగాను యిటీవల దాశరధి వ్రాసిన జోల పాటను, సంగీత దర్శకుడు ఘంటసాల విజయాగార్డెన్ థియేటర్లో ధ్వని ముద్రణ చేశారు.

''లాలీ! నా కన్నా<br>
జో జో! నా చిన్నా<br>
జాబిల్లి జోల పాడాలి<br>
కలలందు నీవు తేలాలి'' అన్న

యీ జోలపాటను సుశీల పాడినప్పుడు, విన్న వాళ్లందరికి నిదుర వచ్చిందంటే నమ్మండి. ఈ పాటను కథానాయిక కల్పనపైన చిత్రీ కరించారు. దర్శకుడు బాబురావు.

### నాయిక పాత్ర

తులసిదళము ఎంత పవిత్రమైనదో, ఎంత పూజనీయమైనదో, రామవిజేతా ఫిలింస్ వారి నాయిక కల్పన పాత్రకూడా అంత వుదాత్తమైనది, పవిత్రమైనది గాబట్టే ''తులసి'' అని పేరు పెట్టడం జరిగింది, అన్నారు బాబురావు. ఈ చిత్రాన్ని కె. ఏ. ప్రభాకర్ నిర్మిస్తున్నారు.

''తులసి'' చిత్రంలో డాక్టరుగా జగ్గయ్య, ఆయనకు నచ్చిన అమ్మాయిగా భారతి నటి స్తున్నారు. ముఖ్య పాత్రలను కృష్ణంరాజు, గుమ్మడి, రావు గోపాలరావు, మాడా, లకనం, సావిత్రి, జి. వరలక్ష్మి పోషిస్తున్నారు. మాట లను పినిశెట్టి, ఛాయను అన్నయ్య నిర్వహిస్తు న్నారు. లక్ష్మి విడుదల.

## కృష్ణకు మరొక రంగుల చిత్రం

ఎస్. ఏ. మూవీస్ ఈస్ట్‌మన్ కలర్‌లో నిర్మించనున్న చిత్రంలో కృష్ణ నాయక పాత్రను పోషిస్తారు. ఈ చిత్రానికి కె. బి. తిలక్ దర్శకుడు. నిర్మాతలు: గుమ్మడి శ్రీమన్నారాయణ, కొర్లిపర కృష్ణారావు.

## ఎస్వీఆర్ ద్విపాత్రాభినయం

అనిత ఆర్ట్స్ నిర్మించిన ''గాలిపటాలు'' చిత్రంలో ఎస్వీ రంగారావు ద్విపాత్రాభినయం ప్రత్యేక ఆకర్షణ కాగలదు. ఈ చిత్రంలో కృష్ణ, విజయనిర్మల, పద్మనాభం, శ్రీవిద్య, గుమ్మడి, సావిత్రి, మంజుభార్గవి, జగ్గయ్య (గెస్టు), రాజనాల, మిక్కిలినేని, ప్రభాకర రెడ్డి, అల్లు రామలింగయ్య ముఖ్య పాత్ర ధారులు. కథను, సినిమా అనుకరణను, దర్శకత్వంను తాతినేని ప్రకాశరావు చేపట్టారు మాటలను భమిడిపాటి, సంగీతాన్ని చలపతి రావు సమకూర్చారు. అశోక్ కుమార్ ఛాయను, తోట కళను నిర్వహించారు.

## ''మాయా మచ్ఛీంద్ర''

పింజల సుబ్బారావుకు హిందీ చిత్రరంగం ఆశాజనకంగా వుండడంవల్లనే, ఆయన తెలుగు చిత్రం గూర్చి ఆలోచించడంలేదు. ఇప్పుడు ''మాయా మచ్ఛీంద్ర''ను బాబు బాయ్‌మిస్త్రీ దర్శకత్వంలో పూర్తి రంగు లలో తలపెట్టారు.

## రవి ఆర్ట్స థియేటర్స్ చిత్రానికి హిందీ గాయని

''నవ్వు... నవ్వించు నవ్వలేనివారికి నీ నవ్వులు పంచు'' అన్న పాటను హిందీ గాయని వాణీ జయరామ్‌చేత పాడించారు,



''ముగ్గురు అమ్మాయిలు''లో చంద్రకళ, భారతి, ప్రమీల

సంగీత దర్శకుడు కోదండపాణి. ఈ పాటను రవి ఆర్ట్ థియేటర్స్ వారి రెండవ చిత్రానికిగాను ధ్వని ముద్రణ చేయగా, జయంతి, నాగ భూషణంలపై చిత్రీకరించారు, దర్శకుడు ఏ. భీంసింగ్.

కష్టాల కడవిలో చుక్కాని చేబూని కాపురాన్ని గట్టెక్కించిన పుత్తమ యిల్లాలుగా జయంతి నటిస్తున్నది. ఒక వినూత్నమైన, విశిష్టమైనపాత్రనునాగభూషణం చేపట్టారు. స్త్రీ గొప్పదనాన్ని, సహన సంపదను, త్యాగ నిరతిని చాటిచెప్పే కథ యిది, అన్నారు నిర్మాతలలో ఒకరైన బసవయ్య. మరొక నిర్మాతపేరు సిహెచ్. రాఘవరావు. ఈ చిత్రానికి విఠల్ రావు ఛాయను,భాస్కరరాజు కళను, పాల్ దొరైసింగం కూర్పును, రమణ సహకార దర్శకత్వాన్ని చేబూనారు. ముఖ్య భూమికలను రాజబాబు, సత్యనారాయణ, చంద్ర మోహన్, అల్లు రామలింగయ్య, జయసుధ, కె. విజయ ధరిస్తున్నారు. అతిథిపాత్రలను గుమ్మడి, ప్రభాకరరెడ్డి, రమణారెడ్డి, నాగయ్య పోషిస్తున్నారు. నవయుగ విడుదల.

'ఒకే కుటుంబం' చిత్రానికి కూడా భీంసింగ్ దర్శకుడు అన్న విషయం పాఠకులకు గుర్తుందనుకొంటాను. ఆయన ఒప్పుకొన్న రెండవ తెలుగు చిత్రం కూడా రవి ఆర్ట్ థియేటర్స్‌వారిదే గావడం ముదావహం.



''జీవితరంగము''లో ప్రమీల

## సినిమా



## ''జీవితరంగం''

డాల్టన్ సమర్పించే సమస్యాత్మక చిత్రానికి యీ పేరు పెట్టినట్టు, నిర్మాత గుళ్లపల్లి నాగేశ్వరరావు చెప్పారు. లోగడ 'ఇది కథ కాదు' అని నేనే వ్రాశాను. ''జీవితరంగం'' టైటిలు మీ చిత్రానికి సరైనదని భావిస్తున్నారా? అని నిర్మాతను ప్రశ్నించాము.

''జీవితమే ఒక నాటకరంగం. ఈ రంగంలో రకరకాల మనసత్వాలుగొన్న మనుషులు ఎన్నో రకాల జీవితాలను గడుపుతుంటారు. జీవితరంగంలో చిక్కి, చికాకులకులోనై, నమ్ముకున్నవాళ్ల కోసం అనితర సాధ్యమైన త్యాగాన్ని చేసిన ఒక అభాగ్యురాలి జీవిత కథ గాబట్టి జీవితరంగం పేరు సరైనది'' అన్నారు గుళ్లపల్లి నాగేశ్వర రావు.

''అంతటి మహత్తర త్యాగాన్ని చేసిన అమ్మాయిగా ప్రమీల అద్భుతంగా నటించింది. నటించలేదు... ఆ పాత్రకోసం ఆమె పుట్టినదా అన్న భావాన్ని కలిగించింది'' అన్నారు దర్శకుడు పి.డి. ప్రసాద్. ఈ చిత్రానికి రాజశ్రీ రచనను, రాజేశ్వరరావు సంగీతాన్ని, సుఖదేవ్ ఛాయను, సూరన్న కళను, నరసింహారావు కూర్పును నిర్వహించారు. ప్రధాన పాత్రలను చలం, గుమ్మడి, రంగారావు, చంద్రమోహన్, సావిత్రి, శాంత, రమాప్రభ, జయసుధ, నీరజ పోషించారు. లక్ష్మి విడుదల.

''నవ్వు నవ్వించు'' వాణీజయరాం

## కేరళ ప్రత్యేకత !

కౌముదీ పిక్చర్స్‌వారి ఈస్ట్ మన్ కలర్‌చిత్రం ''కోడెనాగు'' అవుట్‌డోర్ షూటింగు యిటీవల కేరళలో జరిగినట్టు పాఠకులకు తెలిపాము. ఎన్నో సుందర ప్రదేశాలుండ, కేరళను ఎన్నుకోవడంలో ప్రత్యేకత ఏదైనా వున్నదా అని నిర్మాత ఎం. ఎస్. రెడ్డిని ప్రశ్నించాను.

''నేను మాటలలో చెప్పడం ప్రారంభిస్తే కొన్ని పుటలు వస్తాయి. అక్కడి నా అనుభూతులను పద్యరూపంలో పొందుపరుస్తాను'', అంటూ ఒక కాగితంమీద వ్రాసి యిచ్చారు. ఆయన యిచ్చినదానిని యధాతధంగా పాఠకులకు తెలుపుతాను.

''అభ్యంగన స్నానమాడి సౌధాగ్రాన
కురులార్చుకొనుచున్న తరుణియనగ
జడివాన జల్లున తడిసి నిర్మలినమై
చెలువారు ముత్తైపు చిప్పనంగ
అతిసనాతన హైందవాంగన శ్రద్ధతో
ముగ్గులు దీర్చిన ముంగిలనగ
తొలి సంజెవెలుగులో తోమి బోర్లించిన
పంచలోహపు బుర్రి పళ్లెమనగ



''కోడెనాగు''లో చంద్రకళ

# సినిమా

చేసే కార్యక్రమం జనవరి రెండవవారంలో ప్రారంభమవుతుంది.

ఫల్గుణా కంబైన్స్ తెలుగు చిత్రం త్వరలో ప్రారంభమవుతుంది. కథ ప్రస్తుతం కన్నడంలో రాజకుమార్‌తో చిత్రంగా తయారవుతూ వుంది. అదే కథను తెలుగులో నిర్మించడానికి పి. ఏకామ్రేశ్వరరావు నిశ్చయించారు. పెద్ద హీరోలలో ఒకరు ద్విపాత్రాభినయం చెయ్యగలరు.

## శ్రీ లక్ష్మీ ప్రొడక్షన్స్!

ప్రేక్షకులకు నచ్చిన జంటగా విరాజిల్లుతున్న శోభన్‌బాబు, శారదలను ప్రధాన జంటగా పెట్టి పూర్ణచంద్రరావు ఒక సముజ్వల సాంఘిక చిత్రాన్ని నిర్మిస్తున్నారు. ఈ చిత్రానికి తాతినేని రామారావు దర్శకుడు. షూటింగు జనవరి యిరవై ఆరున ఆరంభం. ఈ చిత్రానికి చలపతిరావు సంగీతాన్ని, వెంకటరత్నం ఛాయాగ్రహణాన్ని నిర్వహిస్తున్నారు. సంభాషణలను సత్యానంద్ వ్రాశారు. **ఈ సత్యానంద్ ఎవరు?**

''మాయదారి మల్లిగాడు'' చిత్రానికి

శక్రకోదండ శకలముల్ జారిపడగ
రమణులవి యేరిపోసిన రాసియనగ
మాడముచ్చటగొలిపెడు సోయగాల
బొమ్మ కేరళ భారతదేశమందు
పచ్చపచ్చని కొండలు పంటచేలు
ఊళ్లు సెలయేళ్లు
ఒండొంటి నొరసికొనుట
రాళ్లు జవరాళ్లు బింకాన రట్టువడుట
అచట సహజము
ఈ చిత్ర మెచటగనము'' —

ఈ పద్యాలలో తన అనుభూతులను, అనుభవాలను యిమిడ్చిన ఎం.ఎస్. రెడ్డి కి కేరళభూతలస్వర్గము అనిపించిందట. 'కోడెనాగు'నాయకుడు శోభన్‌బాబు. నాయికలు లక్ష్మి, చంద్రకళ; దర్శకత్వం కె. ఎస్. ప్రకాశరావు; సంగీతం : పెండ్యాల; రచన : ఆత్రేయ. విడుదల : విజయ.

''జోషీలా''లో దేవానంద్, హేమా

## ''నారద వినోదం''

ఈ పౌరాణిక చిత్రాన్ని ఫల్గుణా కంబైన్స్ తలపెట్టింది. కన్నడంలో 'మహాదుస్వర వజ్రగలు' పేరిట విజయఢంకా మ్రోగిస్తున్న ఈ చిత్రాన్ని పి. ఏకామ్రేశ్వరరావు నిర్మించారు.

కన్నడ రాజకుమార్ నారదుడిగా, కృష్ణుడిగా ద్విపాత్రాభినయం చేశారు. నాయికగా జయంతి నటించింది. ఈ చిత్రానికి గోవర్ధన్ సంగీతాన్ని సమకూర్చారు. దర్శకత్వాన్ని వి. ఎస్. ఆర్. స్వామి నిర్వహించారు. తెలుగు

'మనుషులు—
మట్టిబొమ్మ''లులో
జమునాప్రభ, సాక్షిరంగారావు



## సినిమా

ఛాయా రమణీయకతను చేకూర్చినది వీరే. వయస్సులో చాలా చిన్నవాడు. కలంలో బలం వున్నవాడు. మల్లిగాడు చిత్రాన్ని చూచిన ప్రతి ఒక్కరూ ప్రశంసించారు. ఆయనకు యిప్పుడు ఎంతో డిమాండు ఏర్పడింది. అలా ఏర్పడినవాటిలో పూర్ణచంద్రరావు చిత్రం ఒకటి. ఆదుర్తి హస్తవాసి చాలా మంచిది. ఆయన దగ్గర తర్ఫీదుపొందిన వాళ్లందరూ గొప్పవాళ్లు అయ్యారు, అవుతున్నారు, అవుతారు.

### ''అందరూ దొంగలే''

పల్లవి ప్రొడక్షన్స్ ఈస్ట్‌మన్ కలర్‌లో ప్రారంభించిన ''అందరూ దొంగలే'' చిత్రం షూటింగు పూర్తయింది. ఈ చిత్రానికి వి. బి. రాజేంద్రప్రసాద్ దర్శకుడు.

పల్లవి శబ్దంలో ఎంత తియ్యదనం వున్నదో, అంత మాధుర్యం చిత్రంలోకూడా వున్నది. చిత్రం ఆద్యంతం హుషారుగా సాగుతూ, ప్రేక్షకులకు మానసోల్లాసాన్ని కలిగిస్తుంది. ఈ చిత్రానికి ఆచార్య ఆత్రేయ, భమిడిపాటి సంభాషణలను సమకూర్చారు.

హీరో శోభన్‌బాబు డాషింగ్ నటన ఈ చిత్రంలో విజృంభించింది. అతగాడి సరసన లక్ష్మి చలాకీగా నటించింది. ఈ చిత్రానికి ఎస్. వెంకటరత్నం ఛాయాగ్రహణాన్ని చేపట్టారు. విలువైన సెట్లను ఎస్. కృష్ణారావు నిర్మించారు. మధురమైన పాటలను మహదేవన్ సమకూర్చారు.

నవ్వించే జంటగా ఎస్వీరంగారావు, నాగభూషణం ఎంతబాగా చేశారంటే, వాళ్లు కనిపించినప్పుడల్లా థియేటర్లో నవ్వులవర్షం కురవవలసిందే. సహాయ భూమికలను సత్యనారాయణ, ప్రభాకరరెడ్డి, రాజబాబు, నాగేష్, జయకుమారి ధరించారు.

మూడుగంటలసేపు నవ్వుతూ, ఎన్‌జాయ్ చెయ్యగల అన్ని మసాలాలు వున్న వినోదభరితమైన కథ వున్న చిత్రమే ''అందరూ దొంగలే.'' అన్నపూర్ణా విడుదల.

### జగపతి అధినేత విదేశయానం

జగపతి ఆర్ట్ పిక్చర్స్ ''బంగారు బొమ్మలు'' ఈస్ట్‌మన్ కలర్ చిత్రాన్ని జూన్‌లో ప్రారంభిస్తారని ఎన్నోసార్లు వ్రాసియున్నాను. ఈ చిత్రంలో కొంతభాగం విదేశాలలో చిత్రీకరించబడగలదని కూడా తెలిపియున్నాను. నాగేశ్వరరావు, మంజుల ప్రధాన పాత్రలను పోషించే యీ చిత్రానికి ఆత్రేయ మాటలను, మహదేవన్ సంగీతాన్ని, వెంకటరత్నం ఛాయను, కృష్ణారావు కళను, సంజీవి కూర్పును నిర్వహిస్తారు. ఈ చిత్రం కోసం లొకేషన్స్ చూచిరావడానికి జగపతి అధినేత వి. బి. రాజేంద్రప్రసాద్ ఫిబ్రవరిలో బయల్దేర బోతున్నారు.

### డి. బి. ఎస్. లో దాసరి !

ఎన్నో మంచి చిత్రాలను నిర్మించిన డి. బి. నారాయణ త్వరలో మరొక మంచి చిత్రాన్ని నిర్మించబోతున్నారు. ఈ చిత్రానికి దాసరి నారాయణరావు దర్శకుడు. కృష్ణ, వాణిశ్రీ, ముఖ్య పాత్రలను పోషించడానికి సిద్ధంగా వున్నారు. డి. బి. ఎస్. కి మంచి చెయ్యాలి అన్న తలంపు నాయికా, నాయకులకు వుంది. మంచి కథ దొరకడమే తరువాయి, షూటింగు ఆరంభమవుతుంది.

— శ్రీనివాస్

దాసరి నారాయణరావు



### అవీ - ఇవీ - అన్నీ

**కథావాహిని**

రెండు భాగాలు. యువభారతి సాహితీమిత్రుల కథాసంకలనాలు. ఒక్కొక్క సంపుటం వెల రెండు రూపాయలు. ప్రతులకు: యువభారతి, 5, కింగ్స్‌వే, సికిందరాబాదు—500003.

**ఉదయం**

యువభారతీయుల కథా సంపుటి. 68 పేజీలు వెల రెండు రూపాయలు. ప్రతులకు : యువభారతి 5, కింగ్స్‌వే, సికిందరాబాదు—500003.

**మందార మకరందాలు**

బమ్మెరపోతన భాగవతంలోని కొన్ని పద్యాలకు డాక్టర్ సి. నారాయణరెడ్డి వ్యాఖ్యానం. 42 పేజీలు వెల రూపాయి. ప్రతులకు:యువభారతి, 5, కింగ్స్‌వే, సికిందరాబాదు—500003.

నొక్కులుపడ్డాయి. పెదవులు అందంగా వంకర్లు తిరిగేయి.

"నీ పేరు ?" అడిగేడు.

"సీత!" అని చెప్పి, "ఏ నాపేరు మీ కెందుకు ?" అని అడిగింది. వెంకటపతి అది పట్టించుకోలేదు.

"నా పేరు వెంకటపతి. కోర్టులో అటెండరు పనిచేస్తున్నాను" అన్నాడు.

"నేనడిగింది అదికాదు."

"నీ పేరు, నాకెందుకనేగా ? నువ్వు చెప్పడంలోగానీ, నేను అడగడంలో గాని తప్పేమేనా వుందా!" అడిగేడు.

సీత నవ్వింది.

"మీరు చాలా గడుసుగా మాట్లాడతారు" అంది.

తిరిగి బేరం రావడంతో వెంకటపతి అక్కడ్నుంచి కదిలేడు.

—కోర్టు పనిమీద ప్లీడరుగారు పంపితే జగ్గయ్యపేట వెళ్లి రెండ్రోజుల తర్వాత తిరిగి వచ్చాడు వెంకటపతి.

సరిగ్గా ఆ సమయానికే రంగరాజు సుడి గాలిలా దూసుకొని మరీ వచ్చిపడి చెప్పాడు.

"మొన్న, చెప్పలా నీకు, మంగమ్మ—రంకు మొగుడికీ-దానికీ ఏవో, గొడవలొచ్చి కిరస నాయిల్ పోసుకొని, నిప్పు అంటించుకొని చచ్చిపోయింది."

వెంకటపతికి గుండె జల్లుమంది.

"పాపం!" అనేమాట అనుకోకుండానే అతని నోటి వెంట బయటకొచ్చింది.

రంగ రాజన్నాడు.

"దారి తప్పిన ముండ లెప్పుడూ అర్థాం తరంగానే చస్తారు. వుంచుకొన్నాడిని అసలు సొంత పెళ్ళాం దగ్గరకే పోవద్దని పేచీపెడితే ఎవడింటాడు చెప్పు. ఎంత సెడి ముండ నెట్టుకొన్నా, కట్టుకొన్న ఆడది దగ్గర అవుతదిగానీ, ముండ ఎలా దగ్గరవుద్ది ?"

"తప్పండి రంగరాజుగారు. చనిపోయిన మనిషి గురించి దారుణంగా మాట్లాడ్డం మహా పాపం. మనిషి కళ్లకు కట్టినట్టుగా కనబడుతోంది" అన్నాడు వెంకటపతి

"పోయి శవాన్ని చూసిరా. వళ్ళుకాలి కవిరి వాసన కొడుతోంది." మంగమ్మని చూడ్డానికి సాటిమనిషిగా కదిలేడు వెంకటపతి

ఓ పోలీసు కానిస్టేబిల్ వున్నాడక్కడ. దిక్కులేని శవం అయిపడుంది మంగమ్మ.

వెంకటపతి బ్రతుక నేర్చిన వాడుకాదు.

## దోసెడు మల్లెలు

(15వ పేజీ తరువాయి)

చాలా కుర్రాడు. శరీరంలోని రక్తానికి, వీళ్లారుగని ఆవేశవేగానీ కాస్తంత ఆలోచించే శక్తి తక్కువ.

అతనిలోని మానవత్వం వెల్లువలా ప్రవహించింది. పంచనామా తతంగం ముగిసేక దిక్కులేని మంగమ్మ శవానికి దిక్కు అయ్యాడు వెంకటపతి.

పుచ్చ పువ్వులాంటి వెన్నెల్లో స్మశానంలోని సమాధులు, బూడిదపోగులు చిందరవందరగా పడివున్న ఎముకలు, తెంపివడేసిన వాడిపోయిన పూలదండలు'. పగిలిపోయిన మట్టికుండల గాలూకు పెంకులు కనబడుతున్నాయి.

రాత్రి పదిగంటలవేళ. కాటికాపరి మంగమ్మ చితికి నిప్పు పెట్టబోతూ. తను చేయబోతున్న పనిని ఆపి, మంగమ్మ చెవులకి వున్న బంగారపు దుద్దుల్ని పట్టిలాగి బొడ్లో దోపుకున్నాడు.

అదిచూసిన వెంకటపతి మనసు తల్లడిల్లి పోయింది. ఎవరో గుండెని చాకుతో చీల్చి చెండాడినంతగా బాధపడ్డాడు.

దిక్కులేని శవాన్ని దోచుకోడం చూసేక బ్రతుకంటే ఓ విధమైన విరక్తి కలిగింది.

భగభగ పైకి లేచిన మంటల్లో అప్పటికే సంహకాలిపోయిన మంగమ్మ శరీరం పూర్తిగా కాలిపోతుంటే కళ్లనీరు తిరిగిందతనికి.

మంగమ్మ బ్రతికుండగా దాని వయసు తోనూ బలమైన శరీరంతోనూ, చాలామంది లోని వేడిని ఆదుకుంది. కంట్రాక్టరు సూరయ్య, చౌదరిగారు, బట్టలకొట్టు సుబయ్య, సబ్ఇన్స్పెక్టరూ, ప్లీడరుగారు మొదలైనవాళ్లు మంగమ్మ జీవితం అనే జాబితాలో వున్నారు. వాళ్లు మంగమ్మ చావుని తేలిగ్గా తీసుకోడం మానవత్వం కాదనిపించింది వెంకటపతికి.

మంగమ్మకి విరక్తి కలిగింది. వెధవ బ్రతుకు అనుకొంది. తాడూ — బొంగరం లేకుండా తనదంటూ ఏమీలేకుండా బ్రతికి సాధించేదేమిటి? అనుకొంది. అలవాటుపడ్డ బతుకులతో పొట్ట పోషించుకోగలదు. కానీ తనకుగా చెప్పుకోనేందుకు తనవారంటూ ఎవ్వరూలేరు. సూరయ్యకి పక్షవాతం రావడం, తిరిగి బ్రతుకుతెరువు వెతుక్కోవాల్సిన అగత్యం దానికి కలగడంతో మనసు కలతపడి విరక్తితో కిరసనాయిల్ని ఆశ్రయించింది. వెంకటపతి కర్మచేసినందుకు, ఆ మాత్రం ఉదారతకి తోడ్పడలేని మనుషులు వెంకటపతిని అభినందించారు.

ఆరోజు ఎంచేతనోగాని పూల అంగడి దగ్గర సీతని చూడాలనిపించింది వెంకటపతికి. ముందుగా 'కాకా'హోటల్లోకి వెళ్లాడు.

కాఫీ తాగుతూ ఇద్దరు కుర్రాళ్ల మాటలువిని తలతిప్పి చూసేడు.

'ఆ పిల్ల జోలికి పోవద్దని ఎన్నిసార్లు చెప్పేనానీకు. సీత రౌడీ పాపిగాడి ముండ కూతురు. దాని జోలికిపోతే ఆడు నీ పేణాలు తీస్తాడు తెలుసా?'

రెండోవాడు తాపీగా అడుగుతున్నాడు.

“ఇంతవరకు, ఎంతమంది పేణాలు తీసే డేమిటి?” అని.

ఒకడికి కాలు — మరోకడికి చెయ్యి. చాలదూ, బ్రతికినంతకాలం ఏడవడానికి. అదీకాక ఆ పిల్లతల్లి హరిజన జాతిది తెలుసా ?”

ఇంకా వాళ్ల మాటలు సీతపైనే సాగి పోతున్నాయిగానీ, అతను పట్టించుకోలేదు.

వెంకటపతి ఆరోజు పేపర్లో జాతిసమైక్యతని గురించిన సంపాదకీయం చదివేడు.

అతనికి నవ్వొచ్చిందప్పుడు. ఒకతల్లి కడుపున పుట్టిన అన్నదమ్ముల్లోనే సామరస్యం, సమైక్యత కరువైపోయిన ఈరోజుల్లో జాతిసమైక్యత కోసం మానవ సమైక్యత కోసం ఎవడు పాటుపడేది ?

మనిషికి మనిషి తోడుగా సామరస్యంతో మెలిగితే దేశంలో సమస్యలే వుండవు. దేశంలో సంస్కృతి నాగరికతా పెరిగాయి. కానీ మనిషి మనసు ఎదగలేదు.

“డర్టీ హెల్”, అనుకున్నాడు.

తను వంటరివాడు. తనకోసం బాధపడే వాళ్లులేరు. సీత ఓ రౌడీ కూతురు కావచ్చు.

సీత ఓ హరిజనస్త్రీ కడుపున పుట్టింది కావచ్చు.

ప్రజాస్వామ్యంలో సామాన్యమైన మనిషి కుండే హక్కులు సీతకూ వున్నాయి. సీతని తను పెళ్ళి చేసుకొని ఆసత్యాన్ని నిరూపించాలి.

—సీత అతని మాటలు విని కంగారుపడి పోయింది.

“వద్దు బాబుగోరు. నాకు ఆశలు కల్పించ కండి”అంది.

“అదేం సీతా!” అడిగేడు.

“నన్నుగురించి మీకేం తెల్సు బాబుగారు. నేను.........నేను......”అంటూ ఏదో చెప్ప బోయింది.

“నువ్వేం చెప్పకు సీతా! నిన్ను గురించి ఎవర్నో అడిగి తెలుసుకోవలసిన అవసరం నాకు ఏమీలేదు. నాకు కావాల్సింది నువ్వు అంతే!”

“బాబుగారు............!”

వెంకటపతి నవ్వేడు.

“మల్లెలరాశి ముందున్నావు. ఈ పూల లోని పవిత్రత, పరిమళం నీలో వున్నాయని నేను ఆశిస్తున్నాను సీతా!”

'ఈమల్లెమొగ్గల వెనక కథ మీకేంతెల్సు



బాబుగారు !" అది అర్థంలేని ప్రసంగం అని పించింది.

"నేనంటే నీ కిష్టంలేదా?" అడిగేడు వెంకటపతి మాటగా.

"అదికాదు బాబుగారు......"

"మరేం చెప్పకు రేపు వచ్చి మీ అమ్మతో మాట్లాడతాను. అది సరే వాకు, పూలు ఇవ్వవా ?" అడిగేడు నవ్వుతూ.

సీత దోసిటతో మల్లెమొగ్గలు అతని చేతుల్లో పోసింది.

వెంకటపతి ప్రేమగా ఆ మల్లెమొగ్గలని చేతుల్లోకి తీసుకొని వాసనచూశాడు.

* * *

మబ్బులు కమ్ముకొస్తున్నాయి. రోడ్డు మీద దుమ్ము చక్రాల్లా లేస్తోంది. గాలి చల్లగా వీస్తోంది.

వెంకటపతి 'కాకా'హోటలు ప్రాంతాల కెళ్లే సరికి చినుకులు పెద్దగాపడ్డం ప్రారంభించేయి. వెంకటపతి చాలా చికాకు పడ్డాడు. అంగడి మైన సీత లేదు. సీత తల్లి ముత్యాలమ్మ కూర్చునుంది. వెంకటపతిని చూస్తూనే లేచి వెలుపల వున్న తడిక తలుపులోంచి లోపలకి తీసుకెళ్ళింది ముత్యాలమ్మ.

వెంకటపతి అక్కడవున్న ఓ బల్లమైన కూర్చున్నాడు. ముత్యాలమ్మ తడికె తలుపు నానుకొని నించొంది.

పన్నగాదగ్గు వినబడితే తలతిప్పి చూసేడు.

సీత కూర్చునుంది.

వెంకటపతి పక్కలో బాంబు పేలినట్టయింది. సీత మొహంలోకి ఒకసారి చూసేడు. సీత కళ్ళల్లో నీరు సుడులు తిరుగుతోంది. మొహంలో ఓ విధమైన దైన్యత, ఓ విధమైన భయం కనుపించింది. సీత మొహంమై నించి వెంకటపతి ఎరువుగా చూపుని కిందికి దించాడు. చూడకూడదూ అనుకొంటూనే చూసేడు.

సీతకి రెండు కాళ్ళూ లేవు.

వెంకటపతి బుర్ర వాయుగుండం పడిన బంగాళాఖాతంలా తయారైంది. సొరచేపలు తనని పట్టి తినేస్తే బావుండు ననిపించింది.

అక్టోపస్ చేప ఒక్కసారిగా రాక్షసిలా తన మైకి దుమికి మింగేస్తేగానీ ఈ భయంకర నిజంనించి తను దూరం కాలేడు. ఇదేమిటీ ? అనికూడా అనలేక పోయాడు.

వెంకటపతి లేచి నించున్నాడు.

"ఏం బాబుగారు వెళ్లిపోతున్నారా ?" అన్న జీరబోయిన సీత గొంతు తనకి వురి వేస్తున్నట్టుగా వుంది.

"వెళ్లక నేనేం చెయ్యగలను సీతా ?" అతని గొంతులోంచి ఆ మాటలు చాలా కష్టం మైన వచ్చాయి.

## నీవూ—నేనూ

—:o:—

నిమ్మగడ్డ రామ్‌ప్రసాద్
భోగరాజు కోదండరామశర్మ

ఓ ప్రభూ నీవు
కారు చీకట్లో
కాంతి పుంజానివి
విశ్వశాంతికి
మూల సూత్రానివి
నేనో...
నీ నిర్గుణ స్వరూపంలోని
గుణాన్ని
అశరీరుడవైన
నీ శరీరంలోని భాగాన్ని
అణువును
పరమాణువును
కాంతిని కాలదన్ని
శాంతి కోసరమై
చీకట్లో తడుముకొనేవాణ్ణి
నీవు సృజించిన
చీకటి—వెలుగు
సుఖ—దుఃఖాలు
నావని—నేనే దీనికి
కర్తనని భ్రమించి
పగటి వెలుగులో ఆర్కుని
దీపంతో వెతికే మూర్ఖుణ్ణి
పగలూ—రాత్రి
ఉగాది పచ్చళ్ళ
ఉప్పూ—తీపి
అంతా నీ చిత్రమని
ప్రజలకు బ్రతుకుపై
ఆశను
మేఘాకాశంలో
మెరపులా
కలిగించే ఓ ప్రభూ
నే నణువును
నీలోని పరమాణువును

ముత్యాలమ్మ గుమ్మానికడ్డంగా నించోని అంది.

"మా రాజు బిడ్డడివి బాబు, నువ్వుదాన్ని ఉద్ధరిస్తావని నేనమకోలేను. నా బిడ్డ అవిటెది. అది అవిటిదని నీకు తెలీకపోయినా ఎవర్నడిగినా తెలిసేది. అవిటెదాన్ని చేసుకొని నీ బ్రతుకుని పాడుచేసుకోమని నేనడంలేదు. చూసేవుగా బాబూవెళ్లు. సీత అవిటిపిల్లని నీకు ఈ రోజువరకూ తెలీకపోవడం చేతనే ముందుకొచ్చేవని తెలుసు. అదిచెప్పడానికెంత ప్రయత్నం చేసినా చెప్పనిచ్చేవు కాదుట. వెళ్లు బాబూవెళ్లు."

బయట వర్షం కురుస్తూనే వుంది.

వర్షంలో తడుస్తూ బురదలో అడుగులు వేస్తూ గదికి చేరాడు వెంకటపతి. ఇంతకు ముందు వెంకటపతి మనుష్యుల్లో ఎన్నోరకాల మార్పులురావాలని అనుకొన్నాడు. ఆ క్షణంలో ఆ వూరు తనని వెక్కిరిస్తున్నట్టుగా అని పించిందతనికి.

నీతి, ధర్మం, న్యాయం, సత్యం అనే మాటలు ఇతర్ల కోసం ఉద్దేశించబడ్డవి, తన కోసంకాదు. తనుకూడా జనంలో ఓ మనిషే. అన్న విషయం అతను తెలుసుకొన్నాడు.

—వారం గడిచింది. కానీ ఆ వూళ్ళో వుండడం దుస్సాధ్యంగా అనిపించటం ప్రారంభించిందతనికి. మర్నాడే సెలవు పెట్టేసి బస్సెక్కాడు వెంకటపతి.

భయం భయంగా అంగడివేపు చూసేడు. అంగడిమైన సీత ఎప్పట్లా కూర్చునుంది మామూలుగా పూలమ్ము కొంటోంది.

అప్పుడతని మనసు వెల్లువల ప్రవహించింది. సీత దగ్గరకెళ్లి సీత రెండ చేతులూ పట్టుకొని చెప్పాలనిపించింది.

"సీతా ! నువ్వు అవిటెదానివైనా ఫర్లేదు నీకు నేనున్నాను సీతా ! నీ జీవితాన్ని మల్లె పాన్పుచేస్తాను." అని చెప్పి సీతని ఉక్కి బిక్కిరి చేసేయాలనిపించింది.

ఏదో బలహీనత అతన్ని ఆపినట్టయింది సీత అప్పుడే తలెత్తి బస్సువేపు చూసింది.

వెంకటపతి గాలిలో చెయ్యూపాడు కళ్లల్లో నీరు సుడులు తిరుగుతుండగా.

బస్సు కదిలింది. కదిలిన బస్సుల్లోవున్న వెంకటపతికీ సీతకీ మధ్య దూరం అంత కంతకూ ఎక్కువై పోసాగింది.




(గత సంచిక తరువాయి)

"ఏమైందమ్మా? చెప్పు. ఏడుపెందుకు?" విసుక్కున్నాడు. "అది పుట్టింటికి పోయిందిరా..." అంది వెక్కుతూనే. "అబ్బ! అంతేకదా. నేను సాయంత్రందాకా రానని వెళ్లి వుంటుంది. నువ్వా మాట్లాడవు. పిల్లలనా చేరనియ్యవు. ఏం చేస్తుంది చెప్పు?" అన్నాడు—యింతేకదా సంగతి అన్నట్లు—మళ్లీ మెట్లు ఎక్కబోతూ.

'అబ్బాయి, అదికాదురా, నీ డబ్బు దొంగిలించింది. వాలిముచ్చులా — కొంగులో దాచుకుని యిల్లు దాటపోయింది. అది కాస్తా నా కళ్లబడిందిరా. అంతే పెద్ద రాద్ధాంతం చేసింది. ఎంత తెగించిన మనిషిరా. రోగిష్టిదే కాదు. దొంగముండ కూడా.' అంది.

అమాంతం చెంప ఛెళ్లున పగలేయాలని చేయి ఎత్తిన వెంకటేశ్వర్లు అలాగే చేయి దింపేశాడు. "తల్లివి అయిపోయావమ్మా, లేకపోతే నిన్నేంచేసేవాడినో నాకేతెలియదు." పళ్లు కొరుక్కుంటూ.

"అంతేలేరా. నిజంచెప్తే ఆడిపోస్తున్నావు. నామాట నమ్మకం లేకపోతే పిల్లల్ని అడుగు." అంది.

"అమ్మా! అమ్మా! యింకా ఎందుకు సాక్ష్యాలు? నాకు యింకా తెలియదంటావా ఏం జరిగి ఉంటుందో ... అమ్మా ఆ డబ్బు నేనిచ్చానమ్మా దానికి. నమ్ము." అన్నాడు బాధగా వెంకటేశ్వర్లు. "అవ్వ! పెళ్లాన్ని రక్షించడాని కివేంకబుర్లురా? నువ్వెందు కిస్తావు అంతడబ్బు? అదెందుకలా దొంగతనంగా పట్టుకెళ్లపోయింది?" బుగ్గలు నొక్కుకుంటూ అడిగారు.

వెంకటేశ్వర్లుకి ఈ తల్లి కెలా చెప్పాలో, ఎలాచెప్తే అర్థం చేసుకుంటుందో—తెలియలేదు. 'అమ్మా' నీకు నమ్మాలని లేదు. అంచేత నేనేం చెప్పినా నమ్మలేవు. నన్నెందుకమ్మా, యిలా హింస పెట్టేస్తున్నావు? నేనేం పాపం చేశానమ్మా?' అంటూ మెట్ల మీదే కూలబడి ముఖాన్ని మోకాళ్ల మీద వాల్చుకొని రోదించాడు వెంకటేశ్వర్లు.

చెట్టంత కొడుకు ఢీలాపడి కూలబడి పోయేసరికి నిలువునా నీళ్లు కారిపోయింది వెంకటేశ్వర్లు తల్లి. ఆమెకో నిమిషంపాటు ఏంచేయాలో తోచలేదు.

పిల్లలిద్దరూ 'నాన్నా' అంటూ తండ్రి దగ్గరకి పరుగెత్తారు—ఏడుస్తూనే.

వస్తూన్న దుఃఖాన్ని దిగమింగుకుని "చూడమ్మా యీ పసివాళ్లమీద ఒట్టేసి చెప్తున్నాను. నేనే శాంతికా డబ్బిచ్చాను—వాళ్ల చెల్లెలి పెళ్లికి సద్దమని. నువ్వుదానికి దొంగతనం అంటకట్టి పారిపోయేలా చేశావు. నేనింక శాంతి ముఖం ఎలా చూడనమ్మా. ఎలా చూపించను? చెప్పు. ఇదంతా ఎందుకు చేస్తున్నావు? నా మీది ప్రేమ చేతేకదూ? మనవల మీద ప్రేమచేతేకదూ? చూడమ్మా, నీ ప్రేమ నాకొద్దు. నాకూ కొంచెం విషం యిచ్చెయి. హాయిగా చచ్చిపోతాను" బాధగా అన్నాడు.

'బాబూ, వెంకటేశూ ఏంమాటలురా అవి? అది అలాంటిదే అనుకున్నాను రా?' నెమ్మదిగా అంది.

'నువ్వు అనుకుని వూరుకోవు. మనుషులని నిలువునా చంపుతావు. రుక్మిణి నాకు దూరం అయేదాకా నీకు నిద్రపట్టలేదు. ఇప్పుడిక శాంతిని కూడా సంపక చంపావమ్మా. శాంతి కేంలోటమ్మా? చదువుకున్నపిల్ల, నన్ను కావాలని చేసుకుంది. నిన్నూ పిల్లల్నీ కూడా నెత్తిన పెట్టుకుని వుండేది. కాని నువ్వేం చేశావు? ఎక్కడికక్కడే ఆమెని అవమానించావు. మానసికంగా కృంగి పోయేలా చేశావు. ఇప్పటిదాకా మానసికంగా ఎంతో ఆరోగ్యంగా వున్న శాంతి నిప్పుడు రోగిష్టిదానిగా మార్చేశావు. నీకేమొస్తుందమ్మా. శాంతి నీ కేం అపకారం చేసింది? నన్ను పెళ్లి చేసుకోడమేనా? పిల్లలని దగ్గిరకి తీసుకుందుకు

## జరిగిన కథ

కృష్ణ పార్వతమ్మగారి అబ్బాయి. వ్యవసాయం పనులు చూసుకుంటూ, కుటుంబాన్ని చక్కదిద్దుకొస్తున్నాడు. అతనికి మేనమామ అవుతాడు రాఘవయ్య. రాఘవయ్యగారి భార్య సీతమ్మ. వారికి శాంతి, కాంతి, ఆశ అని ముగ్గురమ్మాయిలు, శీను అనే అబ్బాయి ఉన్నారు. ఆడపిల్లల పెళ్లిళ్ల కోసం సీతమ్మగారి దిగులు అంతా ఇంతాకాదు. కృష్ణకి ఆశ అంటే అభిమానం. శాంతిని చూసుకోడానికి వచ్చిన పెళ్లివారు మిగిలిన వాటితోపాటు పెళ్లికొడుక్కి ఉద్యోగం చూసే బాధ్యత కూడా రాఘవయ్యగారి మీద పెట్టారు. శాంతి నలుగురు పిల్లలకి ట్యూషను చెబుతూ కాలక్షేపం చేస్తున్నది. ఒకరోజు పక్కింటి వెంకటేశ్వర్లు గారితో పరిచయమైంది. అతనికి భార్య పోయింది. పిల్లలున్నారు. కాంతికి ఇంటికి ఆలస్యంగా రావడం అలవాటైపోయింది. రాఘవయ్యగారి ఆందోళన అంతా ఇంతా కాదు. కృష్ణ రాకతో ఆ ఇంట్లో వాతావరణం మారిపోయింది. ఆశకి కొండంత ధైర్యం వచ్చింది. ప్రేమించినవాడు కాంతిని మోసం చేశాడు. జగన్నాథం శీనుని దవుర్జన్యంగా అల్లుడ్ని చేసుకున్నాడు. కృష్ణ ఆశని పెళ్లి చేసుకోడానికి పార్వతమ్మగారు అతికష్టంమీద అంగీకరించారు. శాంతి వెంకటేశ్వర్లు పెళ్లి చేసేసుకున్నారు. శాంతికి అత్తవారిల్లు నరకమైంది. కృష్ణ సూర్యంఇంటికి వెళ్లాడు. కృష్ణ అతికష్టంమీద కాంతిని పెళ్లిచేసుకోవడానికి సూర్యాన్ని ఒప్పించాడు. సూర్యం కాంతిని అవమానిస్తాడు. శాంతిని అత్తగారు ఇంటినుండి వెళ్లగొడుతుంది.

ప్రయత్నించడమేనా? చెప్పమ్మా! శాంతి చేసిన తప్పేమిటి?" ఆవేశంగా తల్లి భుజాలు పట్టుకుని కుదిపేస్తూ అడిగాడు వెంకటేశ్వర్లు.

ఎప్పుడూ ఇలా నిలదియ్యని కొడుకుని వింతగా చూసింది అతని తల్లి.

"చెప్పమ్మా! ... హుం ఏం చెప్పకలవు? ఇదంతా నా సుఖంకోరి చేస్తున్నావనుకుంటున్నావు కదూ అమ్మా! నిన్నుచూసి జాలి పడాలా? బాధపడాలా? ఒక్కసారి ఆలోచించు నీకే కూతురుంటే ఆకూతుర్ని యిలాశాంతిని, వారుక్మిణిని నువ్వు చూసినట్టు చూసివుంటే నువ్వు సహించ కల్గేదానివా? నీ కెందుకింత కక్ష కోడలంటే?... అందుకే నాకూ కొంచెం చావడానికి దారి చూపించమ్మా, అదేనా నాకు మనస్సుకి శాంతినీ, సుఖాన్నీ యిస్తుందేమో నే నింక యిది భరించ లేను" అన్నాడు. అవాక్కయి కొడుకుమాటలు వింటూ నిలబడి పోయిందాతల్లి. పిల్లలిద్దరూ తండ్రి కాళ్లని చుట్టుకుని భయంభయంగా నానమ్మ కేసీ తండ్రికేసీ మార్చి మార్చి చూస్తున్నారు.

కొడుకు మాటలు విన్న ఆవిడకి దడ రావడం మొదలు పెట్టింది.

"బాబూ, వెంకటేశూ," అంటూనే మొదలు నరికిన మానులా పడిపోయారు.

గభాలునలేచి తల్లిని పట్టుకున్నాడు వెంకటేశ్వర్లు.

కాని అప్పటికే ఆమెకు స్పృహ పోయింది.

ఎలాగో కష్టపడి ఆమెని పక్కమీదికి చేర్చాడు.

ముఖాన కొంచెం నీళ్లు జల్లి విసరసాగాడు. ఓ పదినిముషాల్లో ఆమె కళ్లు తెరిచింది.

చుట్టూ కలయి చూసింది. "ఏమ్మా, ఎలా వుంది? డాక్టర్ని పిలవనా?" ఆత్రంగా అడిగాడు.

"ఒద్దు బాబూ, యిలా దగ్గరగా రా," అంటూ కొడుకుని దగ్గరకి పిలిచారు.

"ఏమ్మా" అంటూ ముందుకి ఒంగాడు.

అతని రెండు చేతులనీ తన చేతుల్లోకి తీసుకుని "నన్ను క్షమించు బాబూ, నేనిన్నాళ్లూ చాలా రాక్షసంగా ప్రవర్తించాను. నువ్వు గట్టిగా ఏమీ అనలేదెప్పుడూ. అంచేత నువ్వేం బాధపడ్డం లేదనుకున్నానురా, కాని ఈ రోజు...ఎంత భయంకరంగా సత్యం బోధించావురా బాబూ, నా కళ్లు తెరిపించావు" అంటూన్న ఆమె కళ్లవెంట కన్నీరు జారింది.

"నువ్వు నా బాధ తెలుసుకున్నావు అంతే చాలమ్మా, నేను శాంతిని తీసుకువస్తాను. మనం అంతా ఎంతో సంతోషంగా వుండొచ్చు. మనకి ఎంతో మందికి వుండే కష్టాలులేవు. ఎంత హాయిగా వుండొచ్చో ఆలోచించుకో," అంటూ తల్లి చేయి తట్టాడు వెంకటేశ్వర్లు. ఆ చేయి అలాగే పట్టుకున్నారామె.

'బాబూ, శాంతి వస్తుందంటావా? రమ్మను. నేనే క్షమించమని అడుగుతాను. నా కింకా జ్ఞానం రాకుండా అత్తారింటికి వచ్చాను. అప్పట్నుంచి నేను పడ్డవి కష్టాలేరా. మీ నాన్న వాళ్ల అప్పచెల్లెళ్ల మాటలు విని నన్నెలా హింస పెట్టేవారో నువ్వు వూహించలేవురా. వూహించలేవు అలాగే నాలో సాటి ఆడదానిమీద కక్షే పెరిగిపోయింది గాని సానుభూతి పెరగ లేదు. పెరిగే అవకాశం రాలేదు. కాని యీ పూట నా మనస్సు పరిశుభ్రంగా కడిగేసినట్టుందిరా, బాబూ, ఎంతో తేలికగా వుంది. శాంతిని పిల్చుకురా బాబూ, అదివచ్చి నాకు యిచ్చేదాకా పచ్చి మంచినీళ్లు కూడా ముట్టుకోనురా." అంటూ కొడుకు తల నిమిరారు.

"అలాగేనమ్మా, శాంతి తప్పకుండా వస్తుంది" అని తల్లికి ధైర్యంచెప్పి బట్టలు మార్చుకుందుకు పైకి వెళ్లాడు.

ఇంతట్లో అతనికో బ్రహ్మాండమైన అయిడియా వచ్చింది. శాంతిని సర్ప్రయిజ్ చేద్దాం అనిపించింది. పిల్లల్ని మేడమీదికి పిల్చాడు. ఇద్దరూ బిక్కు బిక్కుమంటూ వచ్చారు. పిల్లల్ని దగ్గిర కూర్చోపెట్టుకుని చాలా సేపు అన్నీ మాట్లాడాడు. వాళ్లకి పిన్ని అంటే ఏమిటో అంతా చెప్పాడు.

వాళ్లడిగే ప్రశ్నలను పట్టే—ఆ పసి హృదయాల్లో మారుటితల్లి అంటే ఎలాంటిభయంకరమైన భావాలున్నాయో వూహించుకో కల్గాడు. ఆ భయం పోగొట్టడానికి — శాంతి



సహకారం ఏంతేనా కావాలి అనుకున్నాడు.

'రండి. మనం అంతా వెళ్లి పిన్నిని పిల్చుకు వద్దాం' అన్నాడు.

వాళ్లు అనుమానంగానే తలూపారు.

ఇద్దరికీ డ్రస్ చేసి, తనూ స్నానంచేసి బట్టలు మార్చుకున్నాడు. కిందికి దిగివచ్చేసరికి మనసూ వాతావరణం కూడా ప్రశాంత పడ్డట్లు అనిపించింది వెంకటేశ్వర్లుకి.

బాగా చీకటి పడుతోంది. వీధి దీపాలు ఒక్కొక్కటే తోరణంలా వెల్గుతున్నాయి. ఇళ్లల్లో కూడా ఒకటే అరాలైట్లు వెల్గుతున్నాయి.

పెరట్లో చెట్లమీద పక్షులు చాలా కోలాహలంగా గోల చేస్తున్నాయి.

'అమ్మా, నేనూ పిల్లలూ వెళ్లి శాంతిని తీసుకుని వస్తాం.' అన్నాడు.

'వెళ్లు బాబూ మీరంతా నవ్వుతూ లూ యింట్లో అడుగు పెట్టడం — కోసం వేయి కళ్లతో చూస్తూ వుంటానురా' అన్నారు నీరసంగా.

చాలా వుత్సాహంగా వీధిలోకి నడిచారు పిల్లలూ వెంకటేశ్వర్లు.

పక్కింట్లో మటుకు చాలా నిశ్శబ్దంగా వున్నట్లు కనిపించింది. అనుమానంగానే ఆ యింట్లోకి అడుగు పెట్టాడు.

అతని కళ్లపడ్డ దృశ్యానికి అలాగే కొయ్య బారి నిలబడి పోయాడు. శాంతి నవ్వుతూ ఏడుస్తూ ఏడుస్తూ నవ్వుతూ శూన్యంలోకి చూస్తోంది.

* * *

ఉదయాన్నే యిల్లు వదలిన రాఘవయ్య గారు శాస్త్రుల్లుగారిని వెంట పెట్టుకుని సూర్యం యింటికి వెళ్లారు. అక్కడ సూర్యం

## ఆశకు సంకెళ్లు

తల్లితో వాదించి మాట్లాడేసరికే శాస్త్రుల్లు గారి వంటి గట్టి ప్రాణికే కంఠశోష అయింది.

"చెడినదాన్ని చేసుకున్నట్టే కదండీ" అని ఆవిడ దెప్పుతూంటే తలెత్తలేక పోయారు రాఘవయ్యగారు. అక్కడే ఆయనలో ఒక భాగం చచ్చిపోయినట్లు అయింది.

"పదిహేనువేలు వచ్చే సంబంధం పాడు చేశాడు మీ అల్లుడు. నిక్షేపం లాంటి పిల్ల, నిక్షేపం లాంటి కుటుంబం. అది కాదని యిలాంటి పిల్లని ఎందుకు చేసుకోవాలి ?" అని నిలదీసింది. చివరికి అంతకి ఒప్పుకోక తప్పలేదు శాస్త్రుల్లుగారు యింకా బేరం చేయబోతే వారించారు రాఘవయ్యగారు.

"రెండు మూడు రోజుల్లో డబ్బు పంపిస్తాను. ముహూర్తంపెట్టి అన్నీ సిద్ధం చేస్తాన"ని మాట యిచ్చి బయట పడ్డారు రాఘవయ్యగారు.

ఆయన యివతలికి రాగానే భారంగా నిట్టూర్చారు.

'ఒక భారం తొలిగింది శాస్త్రుల్లూ. నువ్వు మంచి ముహూర్తాలు చూడు. నేను డబ్బు ప్రయత్నంచేసి మిగిలిన ఏర్పాట్లు చూస్తాను" అని జేబులోంచి ఓ అయిదు రూపాయలు తీసి శాస్త్రుల్లుగారి చేతిలో పెట్టి ఆఫీసుకేసి నడిచారు.

ఆఫీసులో తన బల్లముందు కూర్చున్నా రన్నమాటేగాని రాఘవయ్యగారి మనస్సు ఆయనతో లేదు డబ్బు ఎలా పుడుతుందా అని ఆలోచనలు వెతుకుతోంది. తలతిరిగి పోతూంది ఆయనకి.

అప్పుడే సుబ్బయ్య ఉత్తరాలు తెచ్చి యిచ్చాడు. ఏవేవో కాగితాలు. అందులో ఒకటి మటుకు ఇన్సూరెన్సువారి బోనస్ నోటీసు. దాన్ని చేతిలో పట్టుకుని అటూ ఇటూ తిప్పుతూ...వుండిపోయారు రాఘవయ్యగారు. ఆయన మెదడు సడెన్‌గా చురుగ్గా పనిచేయడం ప్రారంభించింది.'అవును నేను చచ్చాకపదివేలు. కాని ఎందుకప్పుడు ?' ప్రశ్నమీద ప్రశ్న వేస్తోంది.

'బ్రతికున్నప్పుడు అవసరానికి ఆదుకోని డబ్బు నే చచ్చాక ఎందుకు నా పిల్లలకి ?' అనుకున్నారు.

ఆయన మనస్సులో కొత్త వూహ, కొత్త ధైర్యం పుంజుకుంది. ఒక నిర్ణయానికి వచ్చారు. మనస్సు ఎంతో తేలికపడింది. సుబ్బయ్యని పిలిచి "నువ్వింటికి వెళ్లి నేను లేటుగా రావచ్చునని చెప్పు అన్నీ సవ్యంగా అయ్యాయి. సూర్యంగారు కూడా సాయంత్రం వస్తారని చెప్పు. వెళ్ళిరా." అన్నారు.

'చిత్తం బాబుగారు, అన్నం తెచ్చేదా అలాగే' అడిగాడు.

'వద్దురా యివ్వాట సరదాగా అందరితో కాంటీన్‌లో తింటాను.' అన్నారు.

సుబ్బయ్య వెళ్ళిపోయాడు.

రాఘవయ్యగారు చెకచెక ఆఫీసు కాగితాలు పూర్తిచేశారు.

మధ్యాహ్నం మూడు గంటలయేసరికి విశ్రాంతి చిక్కింది ఆయనకి.

తన ఆఫీసు డ్రాయరులోంచి ఇన్సూరెన్సు కాగితాల ఫైలుతీసి బోనస్ కార్డు దాల్లో పెట్టేశారు. జాగ్రత్తగా ఆ ఫైలు పై డ్రాయరులో పెట్టి డ్రాయరు మూసేశారు.

ఆయన కెందుకో చాలా తేలికగా సమస్య పరిష్కారం అయిందని ఆనందం కల్గింది. 'యిన్నాళ్లీ ఆలోచన ఎందుకు రాలేదో' అని నవ్వుకున్నారు.

'ఏమిటి రాఘవయ్యగారూ విశేషం ? మీలో మీరే నవ్వుకుంటున్నారెందుకు ?' పక్క గుమస్తా అడిగాడు.

'ఆయన కేమయ్య, కూతుళ్లందరికీ సంబంధాలు కుదిర్చేసి వుంటారు. అవునా సార్' అడిగాడింకో కుర్రక్లర్కు.

'అవునోయ్, నా బాధ్యతలకి ఒక ముగింపు వచ్చేసింది. హాయిగా నవ్వుకో కల్గుతున్నాను.' అన్నారు కుర్చీలో చేరబడుతూ.

"మీరిలా సంతోషంగా వుంటే—చాలా చిన్న వారిలా కన్పిస్తున్నారు సార్' అన్నాడు—



క్రక్లర్క్. అంతా గట్టిగా నవ్వుతున్నారు.

మళ్లీ ఎవరి పనులలో వారు పడ్డారు.

రాఘవయ్యగారి మనస్సులాగే ఆయన బల్ల కూడా ఖాళీగా ఒక ఫైలుకూడా మిగలకుండా వుంది.

తీరికగా కూర్చుని ఆశకి వుత్తరం రాశారు.

'అమ్మా అశా, నిన్ను నమ్మి నేను ధైర్యంగా తప్పుకుంటున్నాను. అన్నివిధాలా జీవితంలో ఓడిపోయానమ్మా. యింకేం మిగలలేదు. కాంతి పెళ్లికి డబ్బు వస్తుంది. ఎక్కడి నుంచి అని అనుమానిస్తున్నావా ? చ్చితల్లీ నేను దొంగతనం చెయ్యలేదమ్మా, నా ఇన్సూరెన్సు డబ్బువస్తుంది. ప్రమాదంలో పోతే రెట్టింపు వస్తుంది. అంతా నీమీదా కృష్ణమీదా ఆధారపడి వుంది తల్లీ జాగ్రత్త. కాంతికి కట్నం యిచ్చేసి పెళ్లి చేసేయండి. అమ్మా, మీ అమ్మ ఉట్టి అమాయకురాలు, కాని మాటకి నేనెప్పుడూ విలువ యివ్వలేదు— పాత కాలపుదని. కాని దాని హెచ్చరికలు చెవిన పెట్టి వుంటే యిప్పుడు మన కుటుంబం యింకోలా వుండేది. కాని నేను చాలా ఆశయాలు కొండల్లా పెంచుకుని దాని బాటలు తోసి రాజన్నాను తల్లీ. నా లాంటి తండ్రులు యింకా ఎందరెందరో బలి అయి పోతే తప్పించి మీ పరిస్థితులిక మెరుగవవమ్మా. మాకు చదువేశాపం. చదువే వరం. ఉద్యోగమే వరం. అదేశాపం. మీరు శాపగ్రస్థులమ్మా. ఆ విముక్తి బలికోరుతుంది... నా బిడ్డలు నన్ను మించినవాళ్లవాలని, నా కంటే వేయి రెట్లు సుఖశాంతులతో వుండాలని కోరుకుంటారు ఏ తల్లీ తండ్రీయైనా, కాని నాకళ్ల ముందే నా ఆశల సౌధం అమూలాగ్రంగా కూలి ధూళిలో కలిసిపోయింది. నేనే విధంగానూ మీ కోర్కెలు తీర్చలేకపోయాను. నా కోర్కె తీర్చుకోలేకపోయాను. నన్నుక్షమించండి తల్లీ. నన్ను మర్చిపొండి'' అని లేఖ ముగించి కవరులో పెట్టి అంటించారు. ఆయన కళ్ళముందు ఆలేఖ చదువుతూ ఆశ ఎలా విలవిల్లాడుతుందో కన్పిస్తూంది.

'సుబ్బయ్యా, యింటి కెళ్ళేముందు యీ ఉత్తరం ఆశమ్మకిచ్చి వెళ్లు' అని కవరు అందించారు.

'నాకీపూట నైట్‌డ్యూటీ బాబూ, బాగా పొద్దోతుంది. రెండు గంటలయి పోవచ్చు— రాత్రికి' అన్నాడు. 'ఫరవా లేదురా ఎలాగా సైకిలుమీదే వెడతావుగా. అలా యిచ్చేసి యింటికి పో...' అన్నారు.

'మీరే వెళ్లిపోతారుగా బాబుగారూ' అనుమానంగా.

'నేను శాస్త్రుల్లుగారూ ఏడుగంటల బండికి వూరుకెడతాం. రేప్పొద్దున్న సెలవు కూడా పెడుతున్నాను' అన్నారు రాఘవయ్యగారు.

'ఏదో పెళ్ళికి డబ్బు ఏర్పాటు కోసం తిరుగుతున్నాడు కాబోలు బ్రాహ్మడు' అనుకున్నాడు సుబ్బయ్య.

ఆఫీసు ఖాళీ అయిపోయింది. ఇంకోగంట అక్కడే కూర్చున్నారు రాఘవయ్యగారు.

చీకటి పడుతూండగా ఆఫీసు వదిలి పెట్టారు. తనచుట్టూ ఓసారి కలియ చూశారు.

గమ్యం ఏదీలేనప్పుడు ఎటు నడిస్తేనేం అన్నట్టు నడవడం ప్రారంభించారు.

ఆయన మనస్సులో అహ్లాదం — నడకలో చురుకు, ఆయన కళ్లలో ఆనందం, కాళ్లలో వేగం అలా ఏఏరోడ్లు తిరిగారో — ఆయనకే తెలియదు.

ఒళ్లు తూలిపోతూంది. కళ్లకి కార్ల దీపాలు కలిసిపోయిన వెల్లుల్లాగా కన్పిస్తున్నాయి. ఆ వెల్గు భరించలేక చేయి అడ్డు పెట్టుకున్నారు. హోరున బ్రేకుల చప్పుడులో లారీ కాబోలు ఆగింది. అప్పటికే వెనక చక్రం దాటింది రాఘవయ్యగారిని!

* * *

''ఏడైనా ఎవరూ'' రాలేదేం చెప్మా ? అంటూ మాటి మాటికీ గడియారం చూసుకుంటున్నాడు కృష్ణ.

శూన్యంలోకి చూస్తూ కూర్చుంది శాంతి. తల్లి పక్కనే కూర్చుంది. ఎవరి ముఖంలోనూ ఉత్సాహంలేదు. భయం ఆవహించి వుందా కొంపని.

'చల్లగా వుంటుంది. నేను పెరట్లో కూర్చుంటానే శాంతీ' అంటూ పట్టుచీర రెప రెప లాడుతూండగా పెరట్లోకి నడిచింది.

చంద్రోదయం అయిపోయింది. చల్లగా గాలి వీస్తూంది.

నిద్ర మాత్రల సీసా చేతిలోనే వుంది. ఆ సీసాని చూసి నవ్వుకుంది కాంతి. పక్కనే మంచినీళ్ల గ్లాసు పెట్టుకుంది. ఆమె మనస్సు ఆనందంగా వుంది. తను ఒక మోసగాడికి గుణపాఠం నేర్పించపోతూంది. తన పౌరుషాన్ని దక్కించుకో పోతుంది. పిరికితనం ఎందుకు? రెండు మాత్రలు మింగింది. మూడు, ఆరు మింగుతూన్న కొద్దీ ఉత్సాహం ఎక్కువ అవుతోంది కాంతికి. బ్రతికుండి ఎవరిని ఆనంద పరచాలి? చదువుకుని ఏవరిని ఉద్ధరించింది కనుక యీ కాంతి? అని నవ్వుకుంది. నాన్న, ఉట్టి పిచ్చి నాన్న. లోకాన్ని మార్చడానికి అంత తేలిక అనుకున్నాడు! ఆశయాలూ ఆదర్శాలూ కొలిక్కి తేవడం అంతసులభం అనుకున్నాడు! నాన్నా! నా మీద | ఎందుకన్ని ఆశలు పెంచు

## ఆశకు సంకెళ్లు

కున్నావు? పిచ్చి నాన్నా. నువ్వు మారితే అంతా మారిపోతారని ఎలా ఊహించావు నాన్నా!... మళ్లీ రెండు మాత్రలు మింగింది. చేతిలో వున్న మాత్ర పంచరంగుల్లో కన్పిస్తూంది కాంతికళ్లకి. దాన్నిపట్టుకున్న మొనవేళ్లు పర్వతాల్లా కనిపిస్తున్నాయి. కాళ్లు తేలి పోతున్నట్టు–తనకి శరీరమే లేనట్టువుంది. కష్టపడి సీసాని నోటిదగ్గరకి తేగల్గింది. తరవాత ఏం జరిగిందో కాంతికి తెలియలేదు. అంతా ఒకటే కాంతిగా, ఒకటే మెరుపుగా వెల్గిపోయింది కాంతి మెదడులో–అలాగే నూతి చప్టాలో వాలిపోయింది.

వల్లని వెన్నెలకాంతి ఆమె కట్టుకున్న తెల్ల బెనారస్ చీరని పాలనురుగులా తోపిస్తూంది. ఆ కాంతిలో జరీపువ్వులు ఉండుండి తలెత్తే మానవ ఆశల్లాగా మెరుస్తున్నాయి. చల్లగాలి చీరకుచ్చెళ్లని మెల్లిగా కదిలిస్తూంది. కాని కాంతి కిదంతా తెలియనే తెలియదు.

ఆలస్యం అవుతున్నకొద్దీ కృష్ణలో ఆత్రుత హెచ్చసాగింది. అనేకవిధాల ఆలోచిస్తూంది అతని మనస్సు.

'ఆశా ఏమైందంటావు? ఎవరూ జాడలేరు!' అనుమానంగా అడిగాడు.

'నాకూ అదే తెలియడంలేదుబావా,' అంది ఆశ అతని పక్కకివచ్చి నిలబడుతూ.

యింతట్లో దూరంనుంచే లైట్లు డిమ్ చేసుకుని కారు తమ యింటిముందు ఆగడం చూసి ఒక్కపరుగున గేటుదగ్గరకి వెళ్లాడు కృష్ణ 'వచ్చారా? ఏంయింత ఆలస్యం?' అంటూ సూర్యాన్ని లోపలికి తీసుకువచ్చాడు

'మా అమ్మ మళ్లీ పేచీ పెట్టిందండీ అసలు వెళ్ళడానికి వీలులేదంది. కాని నా మనస్సు ఒప్పుకోలేదు. కాంతి నా కళ్లు శాశ్వతంగా తెరిపించిందండీ, అంచేత వెళ్ల

కుండానే బయలుదేరి వచ్చేశాను.'' అన్నాడు నుదుట పట్టిన చెమట తుడుచుకుంటూ.

సూర్యం అని తెలియగానే ఆశ లోపలికి పరుగెత్తింది 'కాంతీ' అంటూ.

'చాలాసేపయిందే దాన్ని చూడేలేదు! అన్నారు అనుమానంగా సీతమ్మగారు.

'శాంతీ అంటూ శాంతిని లేపింది ఆశ.' కాంతి ఎక్కడా ? పిలిస్తే పలకదేం ?' అంది భయంగా.

'కాంతి యిక్కడికి పడుకోడానికి రాలేదే. పెరట్లో చల్లగా వుందని పడుకుందేమో' అందోలేదో — ఆశ కాళ్లు వణికాయి— తెలియని భయంతో.

'కాంతీ కాంతక్కా' అంటూ పెరట్లోకి పరుగెత్తింది. అప్పటికే కాంతి పల్కాలేదు. బావా — కాంతి' అంది. ఏమైంది అంటూ లోపలికి వచ్చిన కృష్ణతో.

పెరట్లో నూతి చప్టామీద హాయిగా దీర్ఘ నిద్రలో విశ్రాంతి పొంది పడుకుంది కాంతి.

ఆ దృశ్యం చూసి సూర్యం కూడా కొయ్యబారిపోయాడు. కృష్ణ 'శాంతీ'అంటూ కుదిపాడు అలాగే పడివుంది కాంతి.

''అక్కయ్యా ఎంతపని చేశావక్కయ్యా'' అంటూ కుప్పకూలి ఏడ్వసాగింది ఆశ. ఎంతో మృదువుగా కాంతిని తన చేతుల్లోకి లేవనెత్తుకున్నాడు సూర్యం. 'ఎంత అన్యాయం చేశాను కాంతీ. నా కిలాగా బుద్ధి చెప్పావు ?' కాంతి ముఖంమీద ముఖం ఆనుకుంటూ ఏడ్చాడు సూర్యం.

'అమ్మా కాంతీ, ఏమిటే తల్లీ ఏమైందే?' అంటూ సీతమ్మగారు కూతురి దగ్గరికి వచ్చారు.

సూర్యం కాంతిని హాల్లో పడుకో పెట్టాడు.

'అక్కా, అక్కా ఒక్కసారి కళ్లుతెరు. నువ్వు ఎంతగానో కోరుకున్న వ్యక్తి నీ ఎదుట నిలిచాడు చూడు' ఏడుస్తూ బతిమాలుతూంది ఆశ.

కృష్ణ ఆమెను బలవంతంగా లేవదీసి తన కౌగిట యిముడ్చుకున్నాడు.

'సూర్యం చూశావా మానవ జీవితాలు ఎంత తేలికగా పగిలిపోతాయో, నీటి బుడగ మీది ఇంద్ర ధనుస్సుల కోసం పాకులాటలూ పట్టింపులూ— ఈ లోగా అది పేలే పోయింది.'

బాధతో గొంతు పూడుకు పోయింది కృష్ణకి.

మూడయినట్టుంది ఎక్కడో గడియారం గంటలు విన్పిస్తున్నాయి. అప్పుడే సుబ్బయ్య 'చిన్నమ్మాయిగారూ,' -అంటూ పిలిచాడు.

'ఏంటమ్మా ఎవరూ నిద్రపోలేదా!'అంటూ ఆశ్చర్యపడ్డాడు. హాల్లో అతని కళ్లపడ్డదృశ్యం చూసి అదిరిపోయాడు.

'నాన్నగారీ పుత్తరం యిమ్మన్నారమ్మా, శాస్త్రుల్లుగారితో వూరికెడతానన్నారు' అని కవరు యివ్వబోతుండగానే పోలీసు వ్యాను ఆగింది గుమ్మంలో.

'ఇదేనా రాఘవయ్యగారిల్లు' అని అడిగాడు దిగిన సార్జెంట్.

పోలీసులకి వారి కళ్లముందున్న దృశ్యం వింతగా తోచింది.

'అవును. ఏం కావాలి ?' నెమ్మదిగా అడి-



''మనవాడు గట్టిగా మాట్లాడుతుంటె ఏమీ అర్థంగావటంలేదు. ఏ ఉద్యోగానికి పనికి వస్తాడో ఏమో ?''
''రైల్వే స్టేషనులో ఎనౌన్సరుగా తప్పక పనికివస్తాడులే ! కంగారుపడకు !''

గాడు కృష్ణ. మీ రొక్కసారి మాతో ఆస్పత్రికి రావాలి. ఒక ప్రమాదం జరిగింది' అన్నాడు సార్జెంట్. 'ప్రమాదమా? ఎవరికి?' భయంగా అడిగాడు కృష్ణ.

'రాఘవయ్యగారికే, సారీ. యీ టైములో మిమ్మల్ని యిబ్బంది పెడుతున్నాం. ఆమె' నసిగాడు సార్జెంట్.

'అవును, యిప్పుడే ఆత్మహత్య చేసుకుంది.' నిర్వికారంగా చెప్పాడు కృష్ణ.

'రిపోర్టు యివ్వకుండా దహనం ఏర్పాటు చెయ్యకండి. చెప్పవలసిన బాధ్యత నాకుంది కనక చెప్తున్నాను. ఇప్పుడు వస్తారా ?' అడిగాడు.

'కాస్సేపుండండి. మా మామయ్య ఉత్తరం రాశాడు దాన్ని ఆశ చదవనివ్వండి' అన్నాడు కృష్ణ.

ఆశ వణుకుతున్న చేతులతో కవరు చింపింది. చదివింది.

''నాన్నా! ఎంత అన్యాయం చేశావు నాన్నా !'' గోలగా ఏడవ సాగింది.

'పూర్ మేన్ ! ఆత్మహత్య అని తెలిస్తే యిన్సూరెన్సు యివ్వరని తెలియదు కాబోలు!' నొచ్చుకున్నాడు సార్జెంట్.

కృష్ణని బల్లిలా కరుచుకు పోయింది ఆశ. ఆమె ఏడ్వడం లేదు. సబ్దు అయిపోయింది. అప్పటిదాకా ఒక్కమాట కూడా మాట్లాడని శాంతి గట్టిగా నవ్వడం మొదలు పెట్టింది. అది ఆ నిశ్శబ్దంలో భీకరంగా విన్పించ సాగింది.

'శాంతీ, శాంతీ' అరిచారు వెంకటేశ్వర్లు. శాంతి నవ్వు ఆపలేదు. అలా రాక్షసంగా నవ్వుతూనేవుంది.

సార్జెంట్ ముందుకొచ్చి 'సారీ మేడమ్, తప్పదు'అంటూ చాచి లెంపకాయి కొట్టాడు. తక్షణం షాకిచ్చినట్టు నవ్వు ఆపేసింది శాంతి. కాని ఆమె కళ్లు పిచ్చిగా అందరినీ కలయ చూస్తున్నాయి. వెంకటేశ్వర్లు పక్కనున్న పిల్లల మీద ఆగాయి ఆమె చూపులు.

'భగవాన్ ! ఎందుకీ యింటిమీద యింత కక్ష కట్టారు ? మామయ్య నీకేం ద్రోహం చేశాడు ?' కనబడని దేవుడిని మనస్సులోనే ప్రశ్నించాడు కృష్ణ.

అతనికి—అంతా తలకిందులుగా వుంది. ఎందుకిలా జరిగింది? ఎవరు బాధ్యులు దీనికి? అన్న ప్రశ్నలు వామనమూర్తుల్లాగా అతని మనస్సు పట్టనంతగా పెరిగి పోతున్నాయి...

'మిస్టర్, అసలేమైంది?' అడిగాడు సార్జెంట్.

విషాదంగా నవ్వేడు కృష్ణ.

'ఒక్క ముక్కలో ఏమైంది ? అని మీరు అడిగితే ఏంచెప్పకలను?' అన్నాడు.

''పూర్ మేన్ ఆయన ఆత్మహత్య చేసుకున్నాడు. యిక్కడీపిల్ల ఆత్మహత్య చేసుకుంది యిదంతా...

చేతకాక, సార్జెంట్ లోకంతో పోరాడలేక మా మామయ్య బాగా అలిసిపోయాడు. మా కాంతి యిక వెల్గును భరించలేనంది. ఈ గడ్డి పువ్వులు ఎందుకు పుట్టాయోగాని వీటికి చదువు సంధ్యలు చెప్పించి, ఘనమైన ఆశలు పెంచి వూహల వుయ్యేలలలో వూచి వూచి వుత్సాహం రంగరించి పోసి పెంచాడు మా మామయ్య. కాని సంఘం వాటికి వేరే




పురుషుడు ఏ విషయాన్నయినా ప్రశ్నించేటప్పుడు ఆడుదైతే సిగ్గుపడుతుంది. సిగ్గుపడడం స్త్రీకి సామాన్యమైన స్వభావం. కాని, స్త్రీకూడా కొన్ని విషయాలలో సిగ్గుపడకూడదు. పురుషులలో కూడా కొందరికి సంకోచం స్వభావసిద్ధంగా ఉంటుంది. స్త్రీగాని, పురుషుడుగాని, సంకోచపడరాని సందర్భాలు కొన్ని ఉన్నాయి. అట్టి పరిస్థితులలో సంకోచపడితే నలుగురిలోనూ అవమానం కలగడమే కాకుండా కార్యం పాడుకావడం, అసంతృప్తి, బాధ మున్నగునవి కలుగుతాయి. ఆ ఘట్టాలు తెలిపే శ్లోకం ఇది —

"గీతే వాద్యే, తథా నృత్తే
సంగ్రామే రిపుసంకటే,
ఆహారే వ్యవహారే చ
త్యక్తలజ్జః సుఖీ భవేత్."

పాట పాడినప్పుడూ, వీణ మున్నగువానిని వాయించేటప్పుడూ, నాట్యం చేసేటప్పుడూ, యుద్ధం తటస్థించినప్పుడూ, శత్రువులవల్ల చిక్కు వచ్చినప్పుడూ, భోజనవిషయంలోనూ, వ్యవహారం పరిష్కరించుకోవలసివచ్చినప్పుడూ సంకోచం లేనప్పుడే సుఖం కలుగుతుంది. సంకోచపడితే, కార్యం చెడుతుంది—అని దీని అభిప్రాయం.

మంచి గాత్రం చూచి, పాడగలిగే సామర్థ్యం చూచి ఎవరన్నా పాడమంటారనుకుందాం. లేదా నాటకాల్లో పాల్గొనేటప్పుడు పాడవలసి ఉంటుంది. అప్పుడు సంకోచపడి పాడడం మానివేస్తే నవ్వుతారు. ఒకవేళ సంకోచపడుతూ పాడినా అది ఇంపుగా ఉండదు. స్వేచ్ఛగా గానంచేసినప్పుడే అందరూ ఆనందిస్తారు. తనకూ తృప్తి కలుగుతుంది.

వాద్యం వాయించేటప్పుడూ, నాట్యం చేసేటప్పుడూ కూడా యిదే పద్ధతి. భరత నాట్య ప్రదర్శన మున్నగునవి జరిగేటప్పుడు సంకోచపడితే ప్రదర్శన రసాభాస మవుతుంది. నాట్యం చేసే నర్తకికి చెడ్డపేరు వస్తుంది.

ఆహారంవిషయమై సంకోచపడితే కడుపు కాలుతుంది. అర్ధాకలితో లేచిపోవలసి వస్తుంది. మనస్సులో కూడా చాలా బాధపడవలసి వస్తుంది.

వ్యవహారంలో సంకోచపడితే అన్నింటి కంటే ఎక్కువ ఉపద్రవం! ఇచ్చిపుచ్చుకునే సందర్భాలలో మొగమోటపడితే వ్యవహారాలు తారుమారవతాయి. అందువల్ల అనేకవిధాల నష్టపోవలసి వస్తుంది. ఇతరుల వ్యవహారాల్లో జోక్యం కలుగజేసుకుంటే సాక్షి సంతకాలు, బాధ్యతను వహించి చేసే సంతకాలు ఎన్నో చిక్కులు తెచ్చిపెట్టగలవు.

ఈ కారణాలవల్ల సంకోచమనేది ఉండకూడదు. దేనినయినా నిష్కర్షగా తేల్చుకోవాలి. ముఖ్యంగా—పయి శ్లోకంలో చెప్పిన విషయాలలో సంకోచం ఉండనే కూడదు.★

---

## ఆశకు సంకెళ్లు

విలువ కట్టింది. చదువు చెప్పించు మనుషుల్లా బ్రతుకుతారు అంది. నిజమే కాబోలని నమ్మాడు మా మామయ్య. ఉద్యోగాలు చేయించు, స్వేచ్ఛ యివ్వు. ఎగర నివ్వు, చూసి ఆనందించు అంది. నిజం కాబోలు అనుకున్నాడు పిచ్చి మామయ్య. ఆ రెక్కలు కత్తిరించు అంటే ఎలా కత్తిరించ కలడు? ఆ చదువు తీసేయి అంటే ఎలా తీసేయ కలడు ? మామయ్యకి మతిపోయింది. రెండు నాల్కల సంఘం అతడిని చేతకాని వాడిని చేసింది. చేతకాని వాడివి అంది. ఓడిపోయాడంఢీ మా మామయ్య ఓడిపోయాడు. ఓడిపోతూ కూడా తాను పూయించిన గడ్డి పువ్వులు అమూల్యమైనవి అని నమ్మి—డబ్బు యిద్దామనుకున్నాడు, అవి రాణించడం కోసం. కాని విధి యినుప పాదాల క్రింద, సంఘపు హ్రస్వ దృష్టిలో లోకపు కాకుల పోట్లకి—తునాతునియలయి పోయాయి గడ్డిపువ్వులు. థాంక్ గాడ్, యిది చూడ్డానికి మామయ్య లేడు' అన్నాడు కృష్ణ—బాధగా.

తలమీద టోపీ తీసి చేతిలో పట్టుకుని చనిపోయిన ప్రాణికోసం తలవంచాడు కరడు కట్టిన సార్జెంట్. (అయిపోయింది)

---

# వారఫలం

—మహేష్

**11-1-1974 శుక్రవారం మొదలు**

**17-1-1974 గురువారం వరకు**

**మేషం** :— మీ కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. మిత్రుల సహాయం లభిస్తుంది. అనవసరమైన సందేహాలు కలుగుతాయి. రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. వారం ఆఖరులో ఆర్థిక వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

**వృషభం** :— మీ మంచితనమే మీకు యిబ్బందిని కలిగిస్తుంది. ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. వారం మధ్యలో వృత్తిలో ఆదాయం పెరుగుతుంది. నూతన విషయాలను తెల్సుకొంటారు. వారం ఆఖరులో మీరు అనుకునేది ఒకటి జరిగేది మరొకటి కావచ్చును. స్త్రీలకు—దైవకార్యాలు నెరవేరతాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**మిథునం** :— వృత్తిలో అనుకూల వార్తలను వింటారు. సజ్జన సాంగత్యం లభిస్తుంది. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. స్థిరాస్తి వ్యవహారాల్లో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. మీకు మున్ముందు లాభించగల వ్యవహారాల్లో అభివృద్ధిని సాధించగలరు. స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. దైవకార్యాలు నెరవేరతాయి.

**కర్కాటకం** :— మీఆలోచనలు ఫలిస్తాయి. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. అధికారుల వలన జరగ వలసిన వ్యవహారాలు బాగుంటాయి. వారం ఆఖరులో అన్ని వ్యవహారాల్లోను ఫలితం సామాన్యంగా ఉంటుంది. స్త్రీలకు—పుణ్యకార్యాలు చేస్తారు. కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి.

**సింహం** :— వృత్తి వ్యాపారాలు బాగుంటాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. రాజకీయ వ్యవహారాలు బాగుంటాయి. మిత్రులకు సహాయం చేస్తారు. స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. అలంకార వస్తువులు కొంటారు.

**కన్య** :— ప్రయోజనం లేని శ్రమ కలుగుతుంది. మీ తాలూకు వస్తువులు పోవచ్చును. వారం మధ్యలో అన్ని వ్యవహారాలు బాగుంటాయి. సాటివారిలో గౌరవం లభిస్తుంది. భాగస్వాములతో

తెలిసి తెలిసి వ్యాపారాలు లాభిస్తాయి. ప్రయోజనాలోచనలు చేస్తారు. స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. వ్యతిరేకమైన వార్తలను వింటారు.

**తుల** :— వ్యాపారంలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. నూతన విషయాలను తెల్సుకొంటారు. వారం మధ్యలో చికాకులు యేర్పడతాయి. ఉద్యోగంలో కార్యభారం పెరుగు తుంది. వారంఆఖరులో వృత్తిలో ఆదాయం పెరుగు తుంది. మీ ప్రయత్నాలు ఫలించగలవు. స్త్రీలకు—ఆరోగ్యం బాగుండదు. శుభకార్యాల విషయంలో అనుకూలత లభిస్తుంది.

**వృశ్చికం** :— వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కలుసుకొంటారు. సజ్జన సాంగత్యం లభిస్తుంది. సాహసముతో కూడిన వ్యవహారాలు బాగుంటాయి. వారం ఆఖరులో వ్యతిరేక పరిస్థితి యేర్పడు తుంది. విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీ కృషికి ఆటంకాలు రాగలవు. స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల్లో శ్రమ కలుగు తుంది. బంధువులకు సహాయం చేస్తారు.

**ధనుస్సు** :— రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. నూతన విషయాలను తెల్సుకొంటారు. ప్రయోజనకరమైన పరిచయాలు యేర్పడతాయి. స్థిరాస్తి వ్యవహారాలు బాగుంటాయి. మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. మిత్రుల సహాయం లభిస్తుంది. స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి.

**మకరం** :— మీ తాలూకు మనుషులే మిమ్మల్ని వ్యతిరేకిస్తారు. ఆందోళన కలుగు తుంది. వారం మధ్యలో ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగు తుంది. అనవసరమైన వ్యయం చేస్తారు.

**కుంభం** :— మీ ప్రయత్నాలు సులువుగా నెరవేరతాయి. సాటివారిలో గౌరవం లభిస్తుంది. వారం మధ్యలో వ్యతిరేకత యేర్పడుతుంది. ఉద్యోగంలో ఎవరినీ విశేషంగా నమ్మడం తగదు. వారం ఆఖరులో మీ కార్యక్రమాలు అనుకూలంగా ఉంటాయి. స్త్రీలకు—ఆరోగ్యం బాగుండదు. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**మీనం** :— వ్యాపారంలో శ్రమ మీద అనుకూలత లభిస్తుంది. సాటివారితో వాద ప్రతివాదాలు తగవు. ఆర్థిక వ్యవహారలు బాగుంటాయి. మీ ఆలోచనలు ఫలిస్తాయి. వారం ఆఖరులో ప్రయాణాల్లో శ్రమ కలుగు తుంది. సాహసముతో కూడిన వ్యవహారల్లో నష్టం వస్తుంది. స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. పుణ్యకార్యాలు చేస్తారు.

# ఒకవారం విపరీతం

— పాలాక్షుడు

## కాలుజారి

13వ తేదీ ఉదయం కర్నూలుకు చెందిన 15 సంవత్సరాల భాగ్యలక్ష్మి అనే అమ్మాయి స్కూలుకు వెళుతూ కాలు జారి, కె. సి. కాలువలో పడి చనిపోయిందట. ఆమె శరీరం కోసం ఆ కాలువలో వెతుకుతున్నారు. . .

## ప్రమాదకాలం

బెంగుళూరు నగర వీధిలో పరుగెడుతున్న పి. డబ్ల్యు. డి. శాఖకు చెందిన క్రేన్‌కు కరెంటు తీగలు తగిలాయట. ఆ క్రేను పూర్తు ఎక్కువయినందువల్ల లాంతరు స్తంభం లొంగిపోయి నేలను కరుచుకుందట. ఆ స్తంభం నేలమీద పడబోతూ ఫదేశ్వ నూర్ బాషా అనే కుర్రాడిమీద పడి అతన్ని పొట్టన బెట్టుకొని, ఇంకో ఆరుగుర్ని తీవ్రంగా గాయపరచిందట. ఇది 12వ తేదీ ఉదయం జరిగింది. రోడ్డుమీద నడిచినా, ఫుట్‌పాత్ మీద నడచినా ఒకటిగానే ఉంది.

## మనం మనుషులమేనా ?...

కర్నాటక, మహారాష్ట్ర సరిహద్దు తగాదాలలో ప్రజలకొచ్చిన ఆవేశ ఫలితంగా చాలా ప్రాణాలు, వస్తు వాహనాలు నాశనమవుతున్నాయి రెండు రాష్ట్రాలలో. బిజాపూరుకు చెందిన రబ్‌కావిలో మహారాష్ట్ర వ్యతిరేకులు ఓ పోలీసు కానిస్టేబుల్ని పట్టుకుని నిప్పంటించి చంపేశారట. తన ఫ్యాక్టరీ, రెండు కారులు తగులబెట్టబడ్డాయన్న వార్త విన్న షంకర్‌మండా పర్కార్ అనే ఓ వ్యాపారి గుండె ఆగి చనిపోయాడట.

మహారాష్ట్రకు చెందిన కోల్హాపూరులో ఓ కన్నడిగులుండే గుడిశకు నిప్పంటించిన సందర్భంలో ఆర్నెలల పసిపాప నిలువునా కాలి, చనిపోయిందట. ఇది మహారాష్ట్రుల కార్యం.

## హత్య ? ఆత్మహత్య ?

మైసూరు కె. ఆర్. ఆసుపత్రికి చెందిన 24 ఏళ్ల డాక్టరు కాంతరాజు అనే ఆయన శవం ఆ ఆసుపత్రి ఖాళీ స్థలంలో దొరికిందట. బహుశా మేడమీంచి ఆయన కాలుజారి పడిపోయుండవచ్చు అని పోలీసువారు అనుకుంటున్నారట. ఆయన చావు విషయంలో పోలీసు తీవ్రమైన విచారణ జరపాలని ఆ ఆసుపత్రి డాక్టర్లు కోరారట.

## అబల !....

బెంగుళూరు మాగడి రోడ్డుకు చెందిన మునియప్ప అనే ఆయన భార్య 21 ఏళ్ల రాజమ్మ తన

భర్త తనమీద జూపే నిరాదరణా, భరించలేక, పోట్లాటలకు తట్టుకోలేక, మనసు విరిగి, వీధిలో కిరసనాయిలు పోసుకుని, నిప్పంటించుకుని, కాలి చనిపోయిందిట.

## ప్రేమిస్తావా? చస్తావా?

వణ్ణామ్‌పల్లికి చెందిన 45 ఏళ్ళ చిన్నరాజుకు అదే వూరుకు చెందిన ధనపాల్ అనే అతని భార్య ఉణ్ణామలై అనే ఆమెకు రహస్య సంబంధం ఉండేదట. చిన్నరాజు ముగ్గురు పిల్లల తండ్రట. వారిలా ప్రేమించుకు ప్రేమించుకు, చివరికో రోజున జంటగా పారిపోయి తిరువణ్ణామలైలో కొన్నాళ్ళు కాపురం(!) చేసి, తిరిగి సొంత వూరుకు వచ్చేశారట. వూరు పెద్దలు పంచాయితీ పెట్టి ఉణ్ణామలైని చివాట్లు వేసి, భర్తతో చేర్చారట. ఆ చిన్నరాజు ఓ రోజు ఉణ్ణామలైని కలుసుకుని మళ్లీ పారిపోదాన్ని సూచిస్తే "నేనిక కష్టమో, సుఖమో నా భర్తతోనే ఉంటాను" అన్నదట. ఆ మాట తెచ్చిచ్చిన ఆవేశంలో వీధిలో ముగ్గు వేయబోతున్న ఆమెను చిన్నరాజు కొడవలితో నరికి చంపి, ఆవేశంతీరాక తానూ ఆత్మహత్య చేసుకున్నాడట.

## ప్రధాని పై కేసు!

నవంబరు 6వ తేదీన శ్రీమతి గాంధి తన నివాసం నుంచి ఆఫీసుకు, ఆఫీసు నుంచి నివాసానికి గుర్రం బండిలో వెళ్ళడం, రోడ్డు నిబంధనలను అతిక్రమించడంగా లెక్క అనీ, ఆవిడ బొంబాయి పోలీస్ ఆక్ట్‌ను ఉల్లంఘించారనీ, రద్దీ రోడ్ల మీద రద్దీ సమయంలో నెమ్మదిగా నడిచే శకటాలు ప్రయాణం చేయరాదు అనే రూలును




ఆవిడ నిశ్చయంగా అతిక్రమించారని ఢిల్లీ జన సంఘం యూనిట్ ప్రెసిడెంట్‌గారు ఢిల్లీ పోలీసుకు ఫిర్యాదు నమోదు చేశారట. ఈ విషయంలో లోక్‌సభలో డిప్యూటీ హోంమినిస్టర్ మోహిన్ మాట్లాడుతూ "ఆవిడ మోటారు రూలుసుగానీ, పోలీసు ఆక్ట్‌నుగానీ అతిక్రమించలేదన్నారట". ది కింగ్ కెన్ డూ నో రాంగ్... ఆహా!

# డాక్టరు సలహాలు

డాక్టర్ కె. వెంకటేశ్వరరావు

### ఎం. సూర్యనారాయణరావు—నల్లగొండ

నా చిన్నతనం నుంచి కాళ్ళకు చేతులకు పుండ్లు అయినవి. రసికారుతూ వుండేవి. చాలా రకాల మందులు వాడారు. అవి కొంతవరకూతగ్గి ఆ చోట తెల్లని మచ్చలు వచ్చాయి. 4 సం.ల నుండీ ఆయాసం మొదలయింది....

* మీ చర్మంలో ఏర్పడే పుండ్లను 'ఎక్జీమా' అంటారు. మీ ఆయాసం "ఆస్త్మా" కోవకు చెందినది. ఎక్జీమా— ఆస్త్మా— రెండూ అలర్జీ వల్ల ఏర్పడే రోగాలు. చిన్నతనంలో ఎక్జీమా వుంటే వయసుమీరిన కొద్దీ ఆస్త్మా మొదలవుతుంది.

వీటి నివారణకు— 'గామాగ్లాబ్యులిన్' ఇంజక్షన్లు వేయించుకుంటే ఫలితం కనిపిస్తుంది. లేకపోతే పెద్ద పట్టణాలలో "అలర్జీ క్లినిక్"లలో సంప్రదించండి.

### జె. నరసింహారావు—మచిలీపట్నం

నా వయస్సు 45 సం.లు. 3 సం.ల క్రిందటి నుంచి కొద్దిసేపు చదివిన తర్వాత కంటిచూపు మసకగా అవుతూ వుండేది. కళ్ళజోడు వాడమన్నారు. కొన్ని రోజుల తర్వాత అలాగే అయితే— మూత్ర పరీక్ష చేసి షుగర్ వుందని మందులు వాడమన్నారు. కళ్ళజోడు మార్చారు. అయినా అలాగే వున్నది.

* వయస్సు పైబడుతున్న కొద్దీ కంటిలోని "లెన్సు"కొన్ని ప్రకృతి సిద్ధమైన మార్పులను చెందుతుంది. దీనికి తోడుగా "డయాబెటిస్" వున్నప్పుడు ఈ మార్పులు ఇంకా తొందరగా జరిగి, కంటిలోపలి రక్తనాళములు కూడా కంటి లోపలి పొరలకు రక్తము సరిగా సరఫరా చెయ్యలేవు. అందువలననే ఇలా జరుగుతుంది.

"డయాబెటిస్" వున్నప్పుడు— మందులు మాత్రమేగాక ఆహార పదార్థాలను మితంగా తీసుకోవటం, క్రొవ్వు పదార్థాలను మానటం చేయాలి.

### బి. రాధాదేవి—హైదరాబాద్

నాకు చిన్నప్పటి నుంచి తలనొప్పి,ఆయాసం జలుబువస్తూ వుంటాయి. కొన్నిసం.క్రితంముక్కులో కండ పెరిగిందని ఆపరేషన్ చేశాక ఆయాసం రావటం లేదు. (ఎక్కువగా) తలనొప్పి 24 గంటలూ వుంటుంది. నొసలు దవడలు బాగా నొప్పిగావుంటాయి.

* ఈ లక్షణాలు "క్రానిక్ సైనసైటిస్" తెలియజేస్తాయి. పుర్రెలో నొసలు దగ్గర ముక్కు ప్రక్కన వున్న భాగంలోను వున్న గాలి కవాటముల గోడలలోని మ్యూకస్ పొరలువాచి, ఎక్కువగా కఫాన్ని ఉత్పత్తి చేయటంవల్ల ఇలా వస్తుంది. దీనినే సైనసైటిస్ అంటారు. "నేసివియాన్" అనే డ్రాప్స్ తరచూ ముక్కులో వేసుకుంటే చాలా వరకు వుపశమనం కలుగు తుంది.

వేడినీటి ఆవిరిని పీల్చటంవల్ల కూడా ఎంతో వుపశమనం కలుగుతుంది.

### ఎం. రామచంద్రారెడ్డి—మల్లంగుంట

నాకు 6 నెలలుగా చెవులు పూర్తిగా వినబడవు. ఎడమకన్ను రెప్ప వాల్చలేయదు. మూతి వంకరగా వున్నది. అన్నం ఎడమ ప్రక్క తిననివ్వదు. ఎడమ నొసలు పైకి లేవవు.

* ఈ రోగం "ఫేషియల్ పాల్సీ"అనేది. ముఖము మీది కండరములకు వచ్చే నరములు దెబ్బతినటం మూలంగా ఈ వ్యాధి వస్తుంది. ఈ నరం చెవి వెనుకవున్న ఎముక ద్వారా మెదడునుంచి ముఖములోనికి ప్రవేశించుతుంది. ఈ మార్గంలో ఏదైనా ఒత్తిడి తగిలినప్పుడు ఈ వ్యాధివస్తుంది. మూతివంకర మొదలగునవి పోవటానికి శస్త్ర చికిత్స వున్నది. కాని మూలకారణం— "న్యూరాలజిస్టు"లు కనుగొని మీకు సహాయపడగలరు.

### కె. రమాదేవి—తిరుపతి

నాకు వివాహమై 10 నెలలు అయినది. బుతుక్రమము ఇప్పుడు సరిగా రావటంలేదు. బుతుక్రమం వచ్చినప్పుడు రక్తస్రావం అధికంగా ఉంటోంది.

* మీరు ప్రతినెలా బుతుక్రమం వచ్చిన అయిదవ రోజు నుంచి రోజుకి ఒక మాత్రచొప్పున 22 రోజులు— "నోరాస్టైక్లిన్"మాత్రలు వాడండి. మళ్ళీ బుతుక్రమం వచ్చిన 5వ రోజు నుంచి మొదలు పెట్టండి. ఇలా నాలుగు నెలలపాటు వాడితే మీకు తప్పక గుణం కనిపిస్తుంది.

అయితే ఈ మాత్రలు ఆహారం తీసుకున్న తర్వాత వేసుకోవాలి. లేకపోతే కడుపులో మంట, గుండెలలో బరువు వస్తుంది.

### టి. రుగ్మాంగదరెడ్డి—మడికొండ

నా వయస్సు 23 సం.లు "పయోపతి"తో బాధపడుచున్నాను. ఇది వరకు బాగా నడవ కలిగే వాడిని. ప్రస్తుతం కొంచెం దూరం కూడా నడవ లేకపోతున్నాను. అన్ని రకాల వైద్యాలు చేయించుకొన్నాను....

* మీకు డాక్టర్లు చెప్పిన విషయాలు నిజమైనవే. ఈ రోగం వచ్చినప్పుడు కొద్దిగా బలం రావటానికి చికిత్స చేయగలరు. కాని రోగాన్ని అరికట్టడం సాధ్యంకాదు. ఎందు లనలంటే ఈ రోగం పుట్టుకతోనే "జెనెటిక్" మార్పు వల్ల వస్తుంది. ఏదన్నా ఒక అంగములో లోపం అయితే నివారించటానికి ప్రయత్నించవచ్చునుగాని ప్రతి కణములోను ఇమిడివున్న జీన్స్"లలో మార్పులను తీసుకురావటం ఇంతవరకూ కనుగొనబడలేదు.

మీకు ఏ వైద్య శాస్త్రమైనా చెయ్యగలిగేది తాత్కాలిక వుపశమనం మాత్రమే!

# హైదరాబాద్ నోట్‌బుక్

తిరుమల రామచంద్ర

## చేతల వెంగళరావు :

శ్రీ జలగం వెంగళరావు ముఖ్యమంత్రి పదవి స్వీకరించి వారం అయిందో లేదో "ఈయన మాటలవాడు కాదు, చేతలవాడు సుమా !" అనిపించాడు. సెక్రెటేరియట్‌లోను, ఇతరత్రాను చేసిన మార్పులను బట్టి, ప్రజల సమస్యలను పరిష్కరించడానికి శాసనసభ్యులను వినియోగించడం, జంటనగరాల విషయంలో సమావేశాలు ఏర్పాటు చేయడం, సన్మాన సభలలో తనకు వేసిన దండలు వేలం వేయగా లభించిన వేలాది డబ్బును వికలాంగుల సదనాలకు ఇవ్వడం, స్వాగతాలకు, వీడ్కోళ్లకు స్వస్తి చెప్పడం, మొదలయిన సత్కార్యాలను పరిశీలించగా, జలగల్లాగ పట్టుకున్న ఎన్నో సమస్యలను ఈ జలగం లాగివేయడం తథ్యమని ప్రజలకు విశ్వాసం కలిగింది. రాష్ట్రపతి పరిపాలనలోని మేళ్లు కొనసాగి ఫలించగలవనే విశ్వాసమూ దృఢపడింది.

## రోడ్లపై సదస్సు :

రోడ్లు, భవన నిర్మాణాలపై రెండవ సదస్సుకు డిసెంబరు 16న ప్రారంభోత్సవం జరిపినప్పుడు శ్రీ జలగం వెంగళరావు చేసిన సూచనలు అమలు అయితే, ఆంధ్రప్రదేశ్‌లో కొత్త రోడ్ల సంగతి ఎలా ఉన్నా గతుకులు రోడ్లు గతుకులు, గుంతలు లేకపోతాయి, అనిపించింది. "ఈ రోడ్డు ఎక్కడికి పోతుంది ?" అని ఎవరో అడిగారట. "ఎక్కడికీ పోదు చాలకాలంగా ఇక్కడే ఉంది" అన్నాడట మరొకడు. ఇది చలోక్తి అందరికీ తెలుసు. కాని, మన రాష్ట్రం రోడ్లు అలాగే ఉండకపోగా పాతాళానికి పోతుంటాయి. మరమ్మతుకు కంకర కుప్పలు రోడ్ల పక్కన పోస్తారు. అవి వ్యాపించి నేలమట్టమవుతాయి. కొంత కాలానికి వాటిని లారీలకు ఎత్తుతారు— ఫినిష్ ! మరి బాటలు బాగుపడమంటే ఎలా ?

## పూనుస్పర్ధలు విద్యలందే :

పాపం గురజాడ పూనుస్పర్ధలు విద్యలందే అని నెత్తిన నోరు పెట్టుకొని అరిచాడు గాని, నేటికీ విన్నవారు కనిపించలేదు. విద్యాలయాలు, విశ్వవిద్యాలయాలు రణరంగాలుగా మారి, చదువు ముఖ్యమా, ఇతర విషయాలు ముఖ్యమా అన్నంత పరిస్థితి ఏర్పడింది. ఉస్మానియా విశ్వవిద్యాలయం ఆవరణ ముందు విద్యార్థులలో కలకలం రగిలి కత్తి పోట్లకు దిగడం, విశ్వవిద్యాలయం మూత పడటం, విద్యాభిమానులు ఎవరూ హర్షించరు. అభిప్రాయభేదాలు నివారించుకోవడానికి వాద వివాదాలు, చర్చలు, గోష్ఠులు, సదస్సులు, మధ్యవర్తి పరిష్కారాలు ఇంకా ఎన్నో ఉండగా, కరవాలాలు ఝుళిపించటం ఏమి న్యాయమని శాంతికాముకులు, హితవాదులు అయిన ప్రజలు తర్కించుకోవటం సహజం. విద్యార్థులు తమ లక్ష్యం విద్యార్జనగాని, ఖడ్గవాదం కాదని గ్రహించాలని తల్లిదండ్రులు ఆశిస్తున్నారు.

## పండితులా అజ్ఞం ?

డిసెంబరు మొదటి వారంలో మూడు రోజుల పాటు మహబూబియా జూనియర్ కాలేజీలో రాష్ట్ర ప్రభుత్వం నిర్వహించిన సంస్కృత మహోత్సవం అన్ని రంగాల ప్రముఖ విద్వాంసులు— శ్రీయుతులు హెచ్. ఎల్. ఎస్. శాస్త్రి, ఆలంపూరు దేవదారి, కేశవపంతుల నరసింహశాస్త్రి, స్వామి అభేదానంద, బి. ఆర్. శాస్త్రి, వి. మధుసూదనరెడ్డి, ఎస్. రమేశన్, పుల్లెల శ్రీరామచంద్రుడు, చిఫుకుల మార్కండేయశాస్త్రి, శ్రీమతి యశోదారెడ్డిగార్ల వంటి వారి ప్రసంగాలతో, విద్యాశాఖ డైరెక్టరు శ్రీ వి. రామచంద్రన్ సహకారంతో ముచ్చటగా జరిగినా, చివరినాడు అధ్యక్షత వహించిన ప్రభుత్వ కార్యదర్శి శ్రీ పి. ఎల్. శివరాంగారు పండితులపై అఖండ కోపతాండవం చేయటంవల్ల, పలువురు సంస్కృతాభిమానుల మనస్సు చివుక్కుమన్నది. సంస్కృత ప్రచారానికి సంస్కృత పండితులు అడ్డు తగులుతున్నారని, వారు శబ్దాలు వల్లించడంతో ప్రారంభించి పదేళ్లయినా భాష పట్టుబడకుండా చేస్తూ, ప్రాచీన బోధన పద్ధతుల నుంచి గిరిదాటనందున సంస్కృత ప్రచారం సరిగా సాగటం లేదని శ్రీ శివరాం అన్నారు. నేటి సంస్కృతాన్ని సరళతరంగా బోధించటానికి యత్నించినవారు పండితులే. భండార్కర్, శ్రీ కాశీ కృష్ణాచార్యులు మొదలు నేటి గుండేరావ్

## దాదాజీ—ఫోర్జరీ !

"దాదాజీ" అని పిలువబడే శ్రీ అమూయరాయి చౌదరీ, ఆయన శిష్యురాలు శ్రీమతి అంజలీ బెనర్జీ— వీరిద్దరినీ కలకత్తా పోలీసు వారు ఇటీవలే అరెస్టు చేశారు. ఇద్దరూ ఒక వీలునామాకి సంబంధించిన దొంగ సంతకం నేరం చేసినట్లు పోలీసువారు ఆరోపిస్తున్నారుట.

పోలీసులు అరెస్టు చెయ్యటానికి వచ్చినప్పుడు దాదాజీ కాషాయవస్త్రాలు ధరించి ఉన్నారుట ; మామూలు బట్టలలోకి మారి ఆయన శ్రీమతి బెనర్జీతోబాటు పోలీసు హెడ్‌క్వార్టర్స్‌కి వెళ్లారుట.

ఈ కేసు ఆచూకీ పట్టటానికి తమకి ఆరు నెలలు పట్టిందని పోలీసు వారు అంటున్నారుట. దాదాజీ ఇంతకి ముందే ఇటువంటి నేరం చేసిన ఆరోపణ ఫలితంగా అరెస్టు అయి అయిదు సంవత్సరాలు అజ్ఞాతవాసంలో ఉండి 'దాదాజీ'గా బయటపడ్డారో లేదో చూస్తున్నామని కూడా పోలీసు



వారు అంటున్నారుట...(బొంబాయి 'టయిమ్స్ ఆఫ్ ఇండియా' పత్రిక వార్త ఆధారంగా—ఒ. వి.)

డి. ఎ. డి. మందని

ప్ర: దేవుడనలు లేనే లేడంటాను.

జ: కానీ ఎందుకో అలా అన మ్మానూ "లేడూ లేడ౦టూ"నే అత గాడిని తల్చుకోడం- ఉన్నాడేమో నన్న అనుమానం పీడించేనా ?

ప్ర: హిందూ దేశంలో— స్త్రీకి ఏది ముఖ్యం?

జ: పడి వుండడం! అప్పుడే ఆమెకు ఓర్పుకి భూదేవి అనీ పాతివ్రత్యానికి అపర సుమతీదేవి అనీ.. పట్టాలిస్తారు— లేకుంటే గయ్యాళి అంటారు.

ఏమ్. ఎమ్. కర్నూలు

ప్ర: సంసారం సాగరంతో పోలుస్తారెందుకు?

జ: తరగని కెరటాల్లాగానే సంసారంలో ఏవో సమస్యలు తలెత్తుతూనే వుంటాయి. తరంగానికీ తరంగానికీ మధ్య సిరికివాళ్ళ స్నానం చేయ ప్రయత్నించినట్లు— సమస్యల మధ్యలో జీవి సుఖించాలని తాపత్రయపడుతుంది.

బి. కె. కె. హైదరాబాదు

ప్ర: చెప్పే వాళ్ళ చేతలో చూపరెందుకు?

జ: చెప్పువారలెల్ల చేయువారలేయైన లోపే మేల కలదు లోకమునను? !

కె. ఎస్. బి. భీమవరం

ప్ర: కోరికలే దుఃఖానికి కారణం అని నా అభిప్రాయం.

జ: అవచ్చు. కాని కోరిక లేనిదే— ప్రోగ్రెస్ లేదు. కోరికలేనిదే— జీవం లేదు.

ఆర్. ఆర్. కె. ఆర్. పినికెలపాడు

ప్ర: మనసే మనిషికి బందిఖానా?

జ: కాని ఆ బందిఖానా నుంచి దాన్ని తప్పించి ప్రవర్తించే— మనిషినే — పిచ్చివాతంటుంది లోకం.

ప్ర: చెదరిన వీణపలుక్కుతుందా? (లవలిస్తుందా?)

జ: ఏం? వీణ తీగలు తెగితే వీణ పారేయడం నేనెక్కడా చూడలేదు! వైణికుడు కొత్త తీగలు వేయించుకోడం చూశాను!




జి. ఎమ్. ఎస్. పెనుమంట్ర

ప్ర: అసలు స్త్రీ జాతి పుట్టడానికి కారణం?

జ: మగవాడే ఏకాంతాన్ని ఒంటరితనాన్ని భరించలేక— తన పక్క టెముకనితీసి, 'దేవుడూ — నాకో సహచరిని సృష్టించు' అంటూ ప్రాధేయపడ్డాడు. అప్పుడు దేవుడు స్త్రీని సృష్టించాడు. ఇప్పుడామె మగవాడికి పక్కలో బల్లెంలా ప్రాణం తీస్తోందని వాపోతున్నాడు!

ప్ర: ఆడవారి నోట్లో నువ్వు గింజైనా నానదంటారెందుకు?

జ: నువ్వు గింజ నానడం ఎందుకు? నవిలిపారేస్తే పోయేదానికి!

ఎస్. బి. ఎస్ ఎస్. ధర్మవరం

ప్ర: ఏమండీ ఎవరు అజ్ఞాని?

జ: తన స్తోమతు తెలియక, అందని ఎత్తులను ఎగిరేవాడు. రాబడి గుర్తించక జీవన ప్రమాణాలని అబద్ధపు అంచనాల మీద పెంచుకు పోయేవాడు. దైవ నిర్ణయం అంటూ— కుటుంబ భారాన్ని విపరీతంగా పెంచుకుంటూ భార్య రోదన అరణ్య రోదన చేసే వాడు— తన మంచితనంతో తోటివారి ప్రాణాలు తోడేవాడు. . ఇలా యిప్పుడు చాలా రకాల అజ్ఞానులు వుంటున్నారు.

జె. ఎమ్. కె. మదనపల్లె

ప్ర: దేశాంతరం పోవువారికి మీ సలహా ఏమిటి?

జ: 'మా వాళ్ళుట్ట వెధవాయిలోయ్' అంటూ విశాలో మీరూ అనుకోకండి. అందరికీ చాటి పేరువు తీసుకోకండి అని చెప్పాలనిపిస్తుంది. ఎందుకంటే నేను తప్పించి మా వాళ్ళంతా.. అన్నా ఎవరూనమ్మరు నమ్మినట్టు నటించినా పక్కకి తిరిగి నవ్వుకుంటారు స్వదేశం నిర్భాగ్య దేశం అయినా— కనీసం పౌరుషం వుండాలని నా నమ్మకం. అమెరికాలో అంట్లు తోమడం 'డిష్ వాషింగ్' అయినంత మాత్రాన 'మా దేశంలో ఏముంది? చెత్త!' అన్నక్కర లేదు.

పి. జె. సికింద్రాబాదు

ప్ర: సుఖపడ్డానికి కష్టపడ్డంలో అర్థం లేదంటాను.

జ: కాని 'ఇడుమలేని సుఖమించుక కానము' అనా భూమిమీద!

ఆర్. ఎమ్. ఎస్. పి. సూళ్ళూరుపేట

ప్ర: ఆడదాని వయస్సు— మగవాడి జీతం అడక్కూడదంటారెందుచేత?

జ: ఇద్దరి దగ్గిర నుంచీ నిజం రాదు కనుక!

కె. వి. కొయ్యలగూడెం

ప్ర: డబ్బుకి ఎందు కింత గిరాకీ?

జ: ఎప్పుడూ షార్టు సప్లయి కనుక!

బి. ఎస్. వి. తుని

ప్ర: మీరూ జీవితంలో సాధించిన దేమిటి?

జ: అప్పుడే అంచనా వేయడం ప్రారంభించ లేదు సోదరి.

కె. పి. ఆర్. విశాఖపట్నం

ప్ర: కలియుగంలో కరువు లేనిది దేనికి?

జ: అధర్మానికి.

సి. ఆర్. ఎల్. డోర్నకల్.

ప్ర: స్థిరం అంటూ లేని మనస్సుకి బుద్ధి చెప్పడం ఎలా?

జ: మైండ్ యీజా ఏ మంకీ అన్నారు. ఆ మర్కట చేష్టల మధ్యనుంచే— స్థిరత్వానికి నాంది పలుకుతాడు— మానవుడు.

---

హర్కారే వరకు కొన్ని వందలమంది పండితులను నేను చెప్పగలను. శబ్దాలతో ప్రారంభించడం పిల్లలకు, ప్రయోజనములకు కాదు. వీటికి మాటికి ఏమన్నా పడి ఉండే పండితులను, దారినిపోయే దానకర్ణులను అనడం మాని, పరిపాలన యంత్రంలో బిగలయినవారు కర్తవ్యం నిర్వహించడం అవసరం. ఎందుకంటే, ఇది ప్రజాయుగం.

**"ఫార్టీ ఇయర్స్ ఆఫ్ పి. టి. రెడ్డి":—**

ప్రముఖ చిత్రకారుడు, శిల్పి శ్రీ పాకాల తిరుమలరెడ్డి 1975 జనవరి 6న జరుగనున్న షష్టి పూర్త్యుత్సవం సందర్భంగా, ఆయన 40 సంవత్సరాలుగా చేస్తున్న కళాసేవ పురస్కరించుకొని ఆయన మూడు వందల వర్ణ, తదితర చిత్రాలున్న సంకలన గ్రంథం "ఫార్టీ ఇయర్స్ ఆఫ్ పి. టి. రెడ్డి" అనే పేరుతో ప్రచురించడానికి, ఉత్సవ నిర్వాహణకు ఏర్పడిన సంఘం డిశంబర్ మొదటి వారములో కళాభవన్‌లో డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి అధ్యక్షతన సమావేశమయి నాలుగు ఉపసంఘాలు ఏర్పాటు చేసింది. ఈ సంఘాలకు డా. గోపాలరెడ్డి అధ్యక్షులు, శ్రీ దేవులపల్లి రామానుజరావు ఉపాధ్యక్షుడు, శ్రీమతి యశోదారెడ్డి కోశాధికారిణి. ప్రముఖ చిత్రకారుడు శ్రీ డి. దొరైస్వామి, తిరుమల రామచంద్ర సమావేశకర్తలు.

**ఉపశ్రుతి :**

"వెంగళరావంటే ఇంత భయమేమా, అసూయా ఎందుకండీ ?" అనడిగారు ఒకరు. నా మిత్రుడు షేక్ దావూద్ చెప్పిన గాలిబ్ వాక్యం— "హసద్ బహాయే ముతాయే హునర్ హై, క్యాకహియే". జ్ఞాపకం వచ్చింది. ఎక్కడ నిపుణత, సమర్థత ఉంటాయో, వాటిపైనే అసూయ పొడమా ఏమంటాము ?—అంటాడు గాలిబ్.

# పుస్తకాలు

## జంతు శాస్త్రము

జంతు శాస్త్రము: రచన : వి. షలాయెవ్, ఎన్. రీకోవ్ ధర రు. 4—50. రెండవ కూర్పు, అనువాదం: శ్రీ వుప్పల లక్ష్మణరావు. ప్రచురణ—ప్రగతి ప్రచురణాలయం, మాస్కో. దొరకుచోటు : విశాలాంధ్ర పబ్లిషింగ్‌హౌస్.

''జంతుశాస్త్రము'' అనే ఈ గ్రంథము రష్యాలో హైస్కూలు విద్యార్థుల పఠనగ్రంథం. మన విద్యార్థులు దీనిని సంకలన గ్రంథంగా ఉపయోగించవచ్చు. గెటప్ తీరుగా, అచ్చు స్పష్టముగా ధర చవుకగా ఉంది. భాష సరళంగా సుబోధకంగా ఉంది.

నాకు కనబడిన, తోచిన కొన్ని విషయాలు రాస్తున్నాను. అనువాదకులు ప్రచురణకర్తలు సహృదయంతో స్వీకరించి మార్పులు చేస్తే గ్రంథం ఇంకా ప్రచారంలోకి వస్తుంది.

1. పారిభాషిక పదాలలో కొన్ని సమంజసంగా లేవు. తెలుగు అకాడమీ పదజాలం ఉండనే ఉంది. ప్రచారంలోకి వచ్చేసింది కూడా. అవే ఇక్కడా ఉంటే విద్యార్థులకు సౌకర్యం. చివర పారిభాషిక పదజాలం ఇచ్చారు. అది సవరించాలి. ఇంకా విస్తృతంగా ఉండాలి. అనేకం అందులోకి రాలేదు. కొన్ని పదాలు, సరి అయినవాటితో సహా ఇస్తున్నాను. బ్రాకెట్‌లో ఉన్నవి సరి అయిన పదాలు. ఇలా ఇంకా చాలా ఉన్నాయి.

పరపుష్టము (పరాన్నజీవి). గర్భోత్పాదనము (బీజ సంయోగము). లార్వా (డింభకము) రూపభేదం (రూపవిక్రియ). రజ్జు (పృష్ఠ దండం) అతిని సత్కారి (అతిదేయము), ఆకు పురుగు (గొంగళి పురుగు), గుదము (పాయువు) వృషణము (ముష్కము). పైగా స్పీషిస్, జీనస్, క్లాస్, ఫైలమ్ వంటి వాటికి సరి అయిన పదాలున్నాయి. స్పీషిస్‌కి 11 పేజీలో తెగ అన్నారు. 136 పేజీలో జాతి అన్నారు.

ద్రవమలము, ముత్యమువంటి ఆలోచిప్ప, ధాతువులు, అంత్యాంగాలు సరి అయిన భావంలో ఉపయోగించలేదు. (21, 56, 36, 307)

2. కొన్ని మాటలు:—

* వాక్యవోలు సందర్భంగా ద్రవాభిసరణ—క్రమత గురించి చెప్పాలి. (24)
* ''క్రిములు'' అనే సమూహం కింద చెముటోడా, అనెలిడాలకు సంబంధం కల్పడం, ఈనాటి జంతుశాస్త్ర పరిస్థితి రీత్యా బాగులేదు. (52)
* తేనెటీగల సందర్భంగా వాటి భాష ప్రస్తావిస్తే బాగుండును ! (106)
* అక్కడక్కడా మార్క్సిజం వైపు మొగ్గు ఎక్కువ ఉన్నది. ముఖ్యంగా డార్విన్ (311) సిద్ధాంత సందర్భంలో. ఇది ప్రస్తుతం సరియైన, నిరూపించబడిన భావం కాదు.
* ''సకసేరుకములు లేక పృష్ఠగల జంతువులు కార్డేటా (రజ్జుగల) అనే ఉప ఫైలమ్‌కు వస్తాయి'' (302). ఈ వాక్యం సరిగా అర్థం కావడంలేదు.

3. సాధారణంగా ఇలాంటి గ్రంథాల్లో అచ్చుతప్పులు ఉండవని ఆశిస్తాం. కాని కొంచెం ఎక్కువగానే కనపడ్డాయి. కొన్ని ఉదాహరణకు:—

ఎనిమాక్యూల్ (18) తుగులుకొని (33) క్రమాభివృద్ధి (87) హెల్‌రిజార్బ్ (139) కరణంగా (193) వీలువైనది (239) కోటలు (272) ఎకినోడెర్మాటా (301) మొప్పు (302) ఉచ్ఛ్వాసంకల్పు (312) ఇంకా కొన్ని ఉన్నాయి.

4. మచ్చుకి ఇచ్చిన ఈ క్రింది భావాలు వాక్యాలు, శాస్త్రరీత్యా పొరపాటుగా అనిపిస్తున్నాయి.

* కండరకణాలు రక్తకణాలు అన్నారు (హైడ్రా) ఇది సరికాదేమో (32)
* ఖండములుగా ఏర్పడిన అంగాలు కంటే, కీళ్లు కలిగిన అంగాలు అంటే సరి అయిన పద ప్రయోగము అవుతుంది. (ఆర్థ్రోపోడా) (71)
* పేను సందర్భంగా టైఫాయిడ్ వ్యాధి వ్యాపిస్తుందన్నారు. వారి ఉద్దేశం, 'టైఫస్ వ్యాధి' అయి ఉంటుంది. (100).
* ఇండియాలోని 250 జాతుల పాముల్లో చాలవరకు విషసర్పాలే అన్నది తప్పు. (169)
* వర్ణించిన ''కుమ్మరి పురుగు'' కోలియోప్టెరాకు చెందుతుంది. కాని మనం సాధారణంగా కుమ్మరి పురుగు అని చెప్పేది గ్రైలోటాల్పా. ఇది ఆర్థోప్టెరాకు చెందుతుంది. ప్రజాతి, జాతి పదాలు ఇస్తే బాగుండును. ఎక్కడో ఇచ్చారు కాని చాల చోట్ల ఇవి ఇవ్వడం జరుగలేదు (79)
* ''రొమ్ము భాగంలో అనేక పెద్ద ముడులుగా ఏర్పడుతున్నాయి ఈ ముడులలో సుప్రా ఈసోఫిజియల్ నాడీ ముడి అన్నిటికంటే పెద్దది'', (83) సుప్రా ఈసోఫిజియల్ నాడీ ముడి తలలో ఉంటుంది కాని రొమ్ములో కాదు.
* ''కుడికర్ణికలోని రక్తంలో ఆక్సిజన్ ఉండదు'' ''చర్మం నుండి ఆక్సిజన్ గ్రహించిన రక్తము ఎడమ కర్ణికలోనికి ప్రవేశిస్తుంది'' (కప్ప) ఇవి సరికావు (151)
* పెంపుడు జంతువులు నూతన జాతులుగా పరిగణించడం సరికాదు. తిరిగి వేరొకచోట కొత్త రకాలు అననే అన్నారు (311) (319)
* చిత్రపటాల సందర్భంగా ''వైపర్'' పాముకు కట్లపాము అన్నారు. ఇది పొరబాటు.

—జమ్మి కోనేటిరావు

* * *

## ధూళిపాళకి సన్మానం

అమాధ్య గుంటూరు వ్యాయవాది గుమాస్తా సంఘం వారు జిల్లా కోర్టు ఆవరణలో సమావేశం జరిపి ప్రముఖ నటుడు ధూళిపాళకి సన్మానంచేసి 'మహా నటశేఖర' బిరుదాన్ని ప్రదానం చేశారు. ఈ సమావేశానికి రిటైర్డ్ జిల్లా మున్సిఫ్ శ్రీ గంటి గోపాలం అధ్యక్షత వహించారు. —(టి.వి.)




Printed and Published by S. NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street, Gandhinagar, Vijayawada-3. Editor: S. Radhakrishna

